Regd. No. HNL. 18

1.10.1993 శుక్రవారం, 10 పేజీలు, సంపుటి: 64, సంచిక: 40, విడిప్రతి: రు. 2.00 లు

## భూమాతకు ఎందుకో అంత కోపం?

భూమాతకు ఎందుకంత కోపం వచ్చిందో? ఒక్కసారి మారు పెద్దైన [illegible] శక్తి గుండెల్లో అంతటి బడబాగ్ని ఎందుకు రగిలిందో? వెయ్యి [illegible] అణుబాంబులు ఒక్కసారి పేల్చినట్లు బ్రద్దలైంది; భూనకం వచ్చిన ధా[illegible] పని ప్రకంపించింది; దేశం యావత్తునూ కల్లోల పరచింది; ఒక్క [illegible] లో ఆదమరిచి ఎందరు ప్రాణాలను తీసిందో

కొరకు 6 పేజీలో

# జమీన్‌రైతు

జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి, స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు

# కోట్ల ఇంటికి అసమ్మతి నిప్పు

రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ కోట్ల విజయ భాస్కర రెడ్డి పని తీరును, వ్యవహార శైలిని వ్యతిరేకిస్తున్న 'అసంతృప్తులు' దాని కింద నీరులా అసమ్మతికి ఆజ్యం పోస్తున్నారు. విస్తరణలో మంత్రి పదవులు కోల్పోయిన వారు, మంత్రి పదవులు ఆశించి భంగపడిన వారు మాత్రమే కాకుండా మంత్రి వర్గంలో స్థానం గాలు దొరకని అన్యదీయులు కూడా ముఖ్యమంత్రికి ఎసరు పెట్టేందుకు దాటు మాటు ప్రయత్నాలు మొదలు పెట్టారు. ప్రస్తుతం వ్యక్తులకు, ప్రాంతాలకు పరిమితమైన అసంతృప్తిని పోగు చేసి అసమ్మతి అస్త్రంగా ప్రయోగించ గల దీటైన నాయకుడి కోసం అసంతృప్తులు అన్వేషిస్తున్నారు.

జనవరి మంత్రి వర్గ విస్తరణలో పదవులు కోల్పోయిన సి. రామచంద్రా రెడ్డి, మహమ్మద్ జానీ, సి.హెచ్.వి. మోహన రావు, సంతోష్ రెడ్డి ముఖ్యమంత్రికి వ్యతిరేకంగా పత్రికలకు ఎక్కక పోయినప్పటికీ కోట్ల వారి కోటకు బీటలు వేసే మార్గాల

### జగన్నాథరావును అడ్డం పెట్టుకొని పివియే మంట ఎగద్రోస్తున్నాడా?

అన్వేషణలో యమ బిజీగా వున్నారు. ముఖ్యమంత్రిని వ్యతిరేకిస్తున్న వారందరినీ కలుసుకొని తమ గోడు వెళ్ల బోసుకోవటంతో పాటు ముఖ్యమంత్రి కుటుంబ సభ్యులు చేస్తున్న అవినీతి పనుల్ని వివరిస్తున్నట్లు తెలుస్తోంది. ముఖ్యంగా కోట్ల కుమారుడు రాజకీయేతర శక్తిగా వ్యవహరిస్తున్నాడని తెలుగుదేశం హయాంలో జిల్లా ఆధిపత్యాన్ని నిలదీసిన కాంగ్రెస్ పార్టీ కోట్ల కుమారుడి వ్యవహారాన్ని ఏ విధంగా సమర్థించు కుంటుందని వారంటున్నట్లు తెలుస్తోంది. తమ పై అవినీతి ముద్ర వేసి అవమాన కరమైన రీతిలో మంత్రి వర్గం నుంచి తొలగించిన ముఖ్యమంత్రి పని తీరును విమర్శించే వారి పై క్రమ శిక్షణా చర్యలు తీసుకుంటామని ముఖ్యమంత్రి సన్నిహితులు బెదరిస్తున్నప్పటికీ చిత్తరంజన్, జలగం ప్రసాద రావు మాత్రం పని గట్టుకొని పత్రికల కెక్కుతున్నారు. వీరంతా ఇప్పుడు ముఖ్యమంత్రి ముందుగా సొంత ఇల్లు చక్క దిద్దుకుంటే మంచిదని మాజీ మంత్రులు ప్రచారం చేస్తున్నారు.

విస్తరణలో మంత్రి పదవులు ఆశించి భంగపడిన పంతం పద్మనాభం, వంగవీటి రత్నకుమారి, జలగం ప్రసాద రావు, చిత్తరంజన్ దాస్ ప్రభృతులు ముఖ్యమంత్రి పై బహిరంగంగా ధ్వజమెత్తి వున్నారు. పిసిసి అధ్యక్షుడి శిబిరంలో చేరి ప్రభుత్వం కంటే పార్టీయే సుప్రీం అన్న వినాదాన్ని లేవనెత్తారు. ప్రభుత్వ పరంగా ముఖ్యమంత్రి ముఖ్యమైన నిర్ణయాలు తీసుకునే ముందు పార్టీని సంప్రదించే సంప్రదాయ ముందని, కోట్ల వారు ఈ సంప్రదాయాన్ని విస్మరించి పార్టీని అవమానిస్తున్నారని వీరంటున్నారు. పిసిసి అధ్యక్షుడు శ్రీ తులసిదాస్‌కు, ముఖ్యమంత్రికి మధ్య వున్న నిప్పుకు వీళ్లు ఉప్పును జత చేస్తున్నారు. తులసీ దాస్ కూడా పని గట్టుకొని అసంతృప్తి ఎమ్మెల్యేల నియోజక వర్గాల్లో పర్యటించాలని నిర్ణయించారు. ఉత్తరాంధ్ర జిల్లాకు చెందిన మాజీ మంత్రి గుర్నాథ రావు అసమ్మతి కార్య కలాపాల్లో తలమునకలై వున్నారు. కృష్ణా జిల్లా నుంచి శ్రీకాకుళం వరకు గల అసంతృప్తియు లందరినీ పోగు చేసి సభ కూడా పెట్టించారు. వంగవీటి రత్నకుమారి, పంతం పద్మనాభం, సి.హెచ్.వి. మోహన రావు ప్రభృతులంతా ఇప్పటికే కూటమిగా తయారై కోట్ల పై యుద్ధానికి అసమ్మతి కత్తులు నూరుతున్నారు.

ఇలా వుండగా ముఖ్యమంత్రి కేవలం తన కులం వారికే పెద్ద పీట

కొరకు 10 పేజీలో

## అల్లూరులో వెల్లడైన యానాది రెడ్డి మనోగతం!

# ఎందరడ్డు పెట్టినా నా పదవి ఆగలేదు!

యానాది రెడ్డి అదృష్టమేమిటో గాని, అభినందన పరంపరలకి అడ్డే లేకుండా వుంది. ఎన్ని సన్మానాలో, ఎన్ని సత్కారాలో, ఎన్ని పూలమాలలో, ఎన్ని శాలువలో, ఎన్నెన్ని ప్రశంసలో! రాజకీయాలలో తనకు గురువుగా, అత్యంతప్తుడిగా భావిస్తూ, విడదీయరాని సంబంధం పెనవేసుకున్న యానాది రెడ్డిని, విష్ణువర్ధన రెడ్డి అల్లూరుకు తీసుకువెళ్లి అన్ని సన్మానాలనూ తలదన్నే ఆడంబరంతో సంతుష్టుణ్ణి చేసి, గురు దక్షిణ చెల్లించుకొన్నారు. 29తేది రాత్రి జరిగిన ఆ సంబరం అల్లూరెప్పుడూ చూసి వుండలేదు. చూడబోదు కూడా!

పూలకిరీటం పెట్టి, పూలతేరువంటి జీపు నెక్కించి రెండు గంటల పాటు టపాసులు, తాళాలు, బిల్లు ఆకాశంలోకి దూసుకు వెళ్లే రాకెట్లతో వూరు వూరంతా హోరెత్తించి, ప్రదర్శన జరిపారు. బోడిగుండు పైన పూలరేకులు గుమ్మరించి కితకితలు పెడుతుంటే, జనం నినాదాల మోత మనసుకు కితకితలు పెడుతుంటే ఒక్క నిముషం కుదురుగా కాలు నిలువని యానాది రెడ్డి గారు కూడా రెండు గంటల కాలం ఆర సెకను వలె గడిపేశారంటే నమ్మండి!

యానాది రెడ్డి గారు ఎక్కడుంటే అక్కడల్లా ఛతురోక్తులు, చురుక్కుమనే వ్యంగ్యోక్తులు వెల్లువలా కురుస్తాయి. ఇక ఆయన సన్మాన సభంటే చెప్పాలా? ఆనం సంజీవ రెడ్డి గారు అధ్యక్షించారు. 'యానాది రెడ్డికి మంత్రి పదవి ఇవ్వమని ముఖ్యమంత్రితో ఒకసారి చెప్పాను – విజయ భాస్కర రెడ్డి చేసిన మంచి పనుల్లో, ఈ మంత్రి పదవి ఒకటి'' అన్నారు సంజీవ రెడ్డి గారు. ''యానాది రెడ్డి గారికి మంత్రిత్వం వచ్చినందుకు నాకెంతో సంతోషంగా వుంది. ఆయనకు ముందే చెప్పాను. అవసరమైతే నీ పేరు సిఫార్సు చేస్తూ సంతకం కూడా పెడతానని'' అన్నారు విప్ శ్రీ సివి శేషారెడ్డి; కలికి, మాగుంట, జనార్దన రెడ్డి, సంజీవ రెడ్డిలు కలిసి పని చేసి జిల్లాలో కాంగ్రెసును గెల్పిస్తారని కూడా అన్నారాయన.

ఆనం వివేకానంద రెడ్డి – యానాది రెడ్డిని అన్ని గ్రూపులూ కలిపే వ్యక్తిగా వర్ణించారు. పదవుల యావలేని వాడని కూడా పొగిడారు. యానాది బావకు ఇందరు అభిమానులున్నారా అని హాశ్చర్యపడ్డారు మాదాల జానకి రాం గారు.

ఈ ఉపన్యాసాలన్నీ వింటుంటే చిర్రెత్తు కొచ్చిందేమో – మంత్రిగారు వుండ బట్టలేక – ''నేను మంత్రిని కావాలని కోరుకున్నట్లుగా కొందరు ఇప్పుడు మంత్రినయ్యాక చెప్తున్నారు; వాళ్లకు బాగు పడే రాతలేదు'' అని శాపం పెట్టేశాడు. నా మంత్రి పదవికి ఎందరో ఎన్ని విధాలుగానో అడ్డం కొట్టారు; కాని అది ఆగలేదు; జిల్లాలో అందర్నీ కలిపి పని చేయమని సిఎం నాకేమీ చెప్పలేదు; పార్టీని గెల్పించ


అల్లూరులో టాప్‌లేని జీపులో వూరేగుతున్న మంత్రి యానాదిరెడ్డికి ఇటు అటు, ఎమ్మెల్యే విష్ణు, చెన్నారెడ్డి పెంచల రెడ్డి

మన్నాదంతే; మంత్రి పదవి నాకు పెద్ద బరువుగా వుంది. ఎప్పుడూ ఇద్దరు గన్‌మెన్‌లు నీడలా వెంటాడు తున్నారు. గుండెల్లో నొప్పిగా వుంది, మద్రాసుకు పోయి వస్తానయ్యా అంటే – ''దానికి'' (అంటే ఏమిటో అర్థమైందా?) అనుకొని నన్ను మద్రాసు రైలెక్క నివ్వడం లేదు. మంత్రయ్యాక జేబులో డబ్బు ఖర్చయి పోతూంది అన్నారు యానాది రెడ్డి గారు. విష్ణు ఆరడుగల అందగాడు; చూడగానే ముద్దొస్తాడు. ముసలి వాడి ప్రక్కన కుర్రవాడని అందరూ ఎగతాళి చేసినా నన్ను వదలి పెట్టలేదు. నా పదవి కోసం విజయభాస్కర రెడ్డి దగ్గర ఉడుం పట్టు పట్టారు. అల్లూరు చిత్రమైన వూరు. నేనైతే ఇక్కడి జనంతో ఆడుకునే వాణ్ని. విష్ణుకు అది చేత కావడం లేదు. జనార్దన రెడ్డి నా- మంచి కోరే వ్యక్తి. నాకు చెడ్డ చేయడు ... ఇట్లా సాగి పోయింది మంత్రి గారి ప్రసంగం.

చివర్న విష్ణు – తన తండ్రి స్వర్గీయ ఆదినారాయణ రెడ్డి గారి స్మృతులు తల్చుకొని కంట తడి పెట్టారు. రాజకీయాలు తెలియని తనను గురువుగా, మిత్రునిగా ఆదరించిన యానాది రెడ్డికి వందనాలర్పించారు; జనార్దన రెడ్డి తనను బాగా చూసేవాడని కితాబిచ్చారు.

ఎమ్మెల్సీ పద్మశ్రీ, కళ్యాణి ఫలింస్ ప్రసన్న రెడ్డి కూడా సభలో పాల్గొన్నారు.

# లాటరీ పేరుతో మూడు లక్షలకు టోపీ!

స్కీంలు, లాటరీలలో ఎన్నిసార్లు మోసపోయినా మళ్లీ మళ్లీ బోల్తా పడుతూనే వుంటారు వెర్రి జనం. రాపూరులో అటువంటి ఘరానా దగా ఒకటి జరిగిందిటీవల. ''శాక్ శివసాయి ఎంటర్ ప్రైజెస్'' అనే స్కీంల అంగడి రాపూరులో పెడుతున్నట్లు ఒక గుర్తు తెలియని యువకుడు రాపూరు చుట్టు ప్రక్కల పల్లెల్లో ప్రచారం చేశాడు. ప్రారంభోత్సవం సందర్భంగా లక్కీ ప్రైజులు ఇస్తామని నమ్మించాడు. సభ్యత్వం కేవలం పది రూపాయలేనని, లక్కు వుంటే లక్షలు వచ్చి పడ్తాయని ఆశ పెట్టాడు. ఇంకే ముంది – జనం ఎగబడ్డారు. దాదాపు 3 లక్షలు కట్టారు. తీరా ప్రారంభోత్సవమని చెప్పిన 26 తేది రాపూరుకు వచ్చి చూస్తే – అక్కడేముంది? కనీసం బోర్డు కూడా లేదు. వాడూ పత్తాలేడు. అంతా దగా అని తెలుసుకొని కుయ్యో మొర్రో అంటూ ఇంటి దారి పట్టారు అమాయక జనం. చీకవోలు, గిలకపాడు, కృష్ణారెడ్డి పల్లి, జారెపల్లి, వెలుగొను, వెలికల్లు, మాదాయపాళెం, లింగపాళెం, చెర్లోపల్లి, మర్లగుంట, పంగిలి, మద్దూరు పాడు గ్రామాల లోని వారు వీడి చేత కుచ్చుల టోపీ పెట్టించుకున్నారు.

ఇన్ని వూళ్లలో ఇందర్ని బోల్తా కొట్టించాడంటే వాడెవడో అసాధ్యుడే!

## జిల్లా వార్తలు

### అరుంధతీయుల ఇళ్లు ఆర్‌టిసి ఆక్రమణ

రాపూరు మజరా మద్దెల మడుగు గ్రామంలో అరుంధతీయుల కోసం ప్రభుత్వం కట్టించిన ఇళ్లు ఆర్‌టిసి ఉద్యోగుల ఆక్రమణలకు గురైనాయి. రాపూరు నానుకొని వుండే ఈ కాలనీలో ప్రభుత్వం 42 ఇళ్లు కట్టించింది. అయితే అప్పుడక్కడ నీటి ఎద్దడి ఏర్పడడంతో అరుంధతీయులందరూ ఇళ్లకు తాళాలు పెట్టి టౌన్‌కు వలస వచ్చేశారు. సందు చూసుకొని ఆర్‌టిసి డ్రైవర్లు, కండక్టర్లు ఒక రొకరుగా ఆ ఇళ్లను ఆక్రమించి పారేశారు. ఖాళీ చేయమని అడిగితే చేయడం లేదు. దిక్కున్న చోట

కొరకు 6 పేజీలో



హైదరాబాద్ గాంధీభవన్‌లో జరిగిన నూతన మహిళా కాంగ్రెస్ సమావేశంలో అధ్యక్షురాలు జమునకు పూలమాల వేసి అభినందిస్తున్న పందిళ్లపల్లి అరుణమ్మ

# జమీన్‌రైతు

## కాంగ్రెస్‌కు చెల్లు చీటి

తమిళనాడులో జరిగిన రెండు ఉప ఎన్నికలలో కాంగ్రెస్‌కు జరిగిన ఘోర పరాభవం ఆ పార్టీ నాయకులకు కనువిప్పు కల్గిస్తుందని ఆశించాలి! జయలలితతో అనవసరంగా పేచీ పెట్టుకొని, ఆమెకు ప్రజలలో ఆదరణ లేదని, ఒంటరిగా ఆమెను హాయిగా ఎదుర్కోగలమని ఢిల్లీ పెద్దల దగ్గర డంబాలు పల్కారు తమిళ కాంగ్రెస్ నాయకులు. తీరా ఫలితాలు చూసేసరికి పరువు పోయింది. పళని లోక్ సభ స్థానంలో కష్టపడి మూడవ స్థానం నిలబెట్టుకో గల్గితే, రాణీపేట అసెంబ్లీ నియోజక వర్గంలో డిపాజిట్ దక్కలేదు. పిఎంకె వంటి అప్రధాన పార్టీకి వచ్చినన్ని ఓట్లు కూడా రాలేదు. అందుకే ఇది ఘోర పరాజయం కాదు, ఘోర పరాభవం. పళని స్థానంలో 1977 నుంచి 1989 వరకు ఒకే ఒక కాంగ్రెస్ నాయకుడు గెలుస్తూ రావడం, ఇప్పుడు అతడి కుమారుడే పోటీచేసినా ప్రయోజనం కల్గకపోవడం గమనార్హం.

తమిళనాడులో ఈ రెండు ఉప ఎన్నికలు, అంతకు క్రితం మన రాష్ట్రంలో జరిగిన కోవూరు, కైకలూరు ఉప ఎన్నికల ఫలితాలు కాంగ్రెస్‌కు ప్రతి కూలం కావడం చూస్తే దక్షిణ భారతదేశంలోనూ ప్రజలు కాంగ్రెస్ పట్ల విరక్తులై వున్నారన్న నిజం ప్రస్ఫుటమౌతున్నది. దక్షిణ భారతదేశంలో అయోధ్య ప్రభావం తక్కువ; బిజెపి పలుకుబడి శూన్యం; మత ఛాందసత్వం లేదు. కేవలం స్థానిక కాంగ్రెస్ ప్రభుత్వాలు, నాయకుల ప్రవర్తనతో విసిగిపోయే ప్రజలు ఆ పార్టీకి దూరమౌతున్నారు. ఆంధ్రలో అవకాశం ఇస్తే నాలుగేళ్లలో ముగ్గురు ముఖ్యమంత్రులు మారి పోయారు. మంత్రి పదవి రాని వారంతా వీధికెక్కి వీరంగాలు వేస్తున్నారు. మంత్రిత్వాలు పొందిన వారు అవినీతిలో మునిగిపోయి వున్నారు. కర్ణాటకలో మూడవ ముఖ్యమంత్రికి ముసలం వచ్చి పడింది. తమిళనాడులో ఏ ఇద్దరు కాంగ్రెస్ నాయకులకూ పొత్తు కుదరదు. అన్ని రాష్ట్రాలలో పార్టీ పెద్దల కుమ్ములాటకే సమయం సరిపోతున్నది తప్ప ప్రజల కోసం ప్రభుత్వాన్ని నిర్వహించడంలో కాంగ్రెస్ విఫలమౌతున్నది. ఈ ధోరణితో విసుగు జెంది, అవకాశమిచ్చి అధికారం అప్పచెప్తే పేనుకు పెత్తనమిచ్చి నట్లవుతున్నదని బాధపడి ఓటర్లు ప్రత్యామ్నాయం కోసం ప్రక్కచూపులు చూస్తున్నారు. ఇప్పటికైనా ఈ వాస్తవాన్ని గ్రహించి వళ్లు దగ్గర పెట్టుకొని ప్రవర్తించ గల్గితే ఏడాదిన్నరలో వున్న ఎన్నికల నాటికి ప్రజలు మనసు మార్చుకునే వీలుంటుంది. అది జరగకుంటే వారు కాంగ్రెస్‌కు శాశ్వతంగా చెల్లుచీటీ వ్రాసేస్తారు.

## ఆవేదన సమంజసం

ఎందరికి మంత్రి పదవులిచ్చినా ఇంకా అలుకలు, అసంతృప్తులంటూ విసిగిస్తే ఎలా అని ముఖ్యమంత్రి శ్రీ కోట్ల విజయభాస్కర రెడ్డి వ్యక్తం చేసిన ఆవేదన సమంజసమైనది. మంత్రి వర్గ విస్తరణలో విజయభాస్కరరెడ్డి పలు వర్గాలకు, కులాలకు స్థానం కల్పించారు. మంత్రి వర్గం సైజును సాంప్రదాయానికి విరుద్ధంగా పెంచిపారేశారు. అయినా అసమ్మతులు, అపార్థాలు తప్పడం లేదు; ఎమ్మెల్యేలు వీధికెక్కడం మానడం లేదు. పదవి రాని ప్రతివాడూ ముఖ్యమంత్రిని తిడుతున్నారు; పదవి వచ్చిన వారూ తమ స్థాయికి తగ్గ శాఖ రాలేదని సణుగుతున్నారు; ఇంకొందరు తమ ప్రత్యర్థులకు పదవు లిచ్చినందుకు ఆడిపోసుకుంటున్నారు . వెరసి, కాంగ్రెస్ పార్టీలో ఈ రోజు సంతృప్తిగా వున్న నాయకుడు ఒక్కరూ లేరు.

పార్టీ టికెట్‌పై గెల్చిన ప్రతి ఒక్కరికీ మంత్రిత్వాలివ్వడం సాధ్యమా? అట్లా అడగడం సమంజసమా? కాంగ్రెస్ వాదులు వుత్త ఎమ్మెల్యేలుగా వుండడానికి సిగ్గుపడుతున్నారా? వారి దృష్టిలో శాసన సభ్యత్వం ఒక పదవి, హోదాగా కన్పించడం లేదా? ఎమ్మెల్యేలుగా గెల్చేది కేవలం మంత్రులు కావడానికేనా? అంతకు మించిన బాధ్యతలు, పరమార్థాలు వేరే లేవా?

చూసేవారికి, వినేవారికి జుగుప్సాకరంగా వుంది కాంగ్రెస్ నాయకుల వైఖరి. ఎన్నికలలో గెల్చిన ప్రక్కక్షణం నుంచి ప్రజలను, ప్రజా సమస్యలను గాలికి వదలి, పదవుల వేటలో మునిగి పోతున్న వీరిని మందలించే, దారికి తెచ్చే ప్రజాస్వామిక వ్యవస్థ మనకు లేక పోవడం దురదృష్టకరం; కాంగ్రెస్ అగ్రనాయకత్వం సైతం తమ శాసన సభ్యులను చక్కదిద్దే, అదుపు చేసే స్తోమతలేక, నిస్సహాయంగా వుండిపోవడం ఇంకా విచారకరం. అసమ్మతి ఒక పరిమితి దాటితే సహించేది లేదని ముఖ్యమంత్రి ప్రకటించారు. కాంగ్రెస్ క్రమశిక్షణా సంఘం సారథిగా ఆయన ప్రకటనలో సీరియస్‌నెస్ వుందనే భావించాలి. పార్టీ పరువుకోసం కాకపోయినా, కనీసం తన ప్రభుత్వ మనుగడకోసమైనా ఆయన మంత్రిత్వాలు రాలేదనే అలుకతో నానాయాగీ చేస్తున్న ఎమ్మెల్యేల నోళ్లు మూయించ గల్గితే, కఠిన చర్యలు తీసుకోగల్గితే ప్రతి కాంగ్రెస్ వాదీ సంతోషిస్తారు. కానీ అది సంభవమా? "ఏమి చేస్తారో, చేయమనండి చూద్దాం" అంటూ వెనువెంటనే మాజీ మంత్రులు జలగం ప్రసాదరావు, చిత్తరంజన్‌దాస్‌లు చేసిన ప్రతి ప్రకటనలు చదివితే మాత్రం ఆ నమ్మకం కల్గడంలేదు.

# జమీన్‌రైతు

1.10.1943

6 పేజీలు 0-1-6 అణా:

## జమీందారీల ఘోరాలు

### పానగల్లు యెస్టేటు పాలన

#### మేర్లపాక రైతుల బాధలు

ఈ ధర్మ పరిపాలన క్రింద ప్రజలు మలమల మాడుచున్నారు. ఈ సంవత్సరం పైర్లు బొత్తిగా ఎండి పోయినవి. రాజా గారితో చెప్పుకుంటే జెను పద్ధతులు లేవు. యెండిపోయిన సంగతి విచారిస్తా మన్నారు. కాని పాపం స్వంత కాళ్లు, కళ్లు లేని ఎస్టేట్లకు నిజం యెట్లా తెలుస్తుంది? రెమిషనుకు ఒకరు వంద మింగినారు. ఇతర చిదర చిదపురుగులు మరొక అయిదు వందలు తెమ్మంటున్నవి. కూటికి చచ్చే పేదలెట్లు తేగలరు?

గోరు చుట్టు పై రోకటి పోటన్నట్లు పట్టాలకిచ్చి పైర్లు పెట్టిన పొలాలను గూడ వదలి పెడతారా? లేదా? అని బాధిస్తున్నారు. జమీందారీలోని బాధ లెన్నని చెప్పగలము? మా రాజా గారి చల్లని ప్రభుత్వం రైతుల నేర్పించుటలో ప్రఖ్యాతి గన్నది.

\- మేర్లపాక పౌరులు

## గ్రామసీమలు

### వెంకటగిరి హరిజన స్త్రీ

వెంకటగిరిలో హరిజన స్త్రీ పట్ల సబ్ యిన్స్పెక్టరుగా వుండిన బెంజిమన్ అనే వ్యక్తి అత్యాచారం జరిపాడని మోపబడిన కేసు సబ్ జడ్జి కోర్టులో విచారణ జరిగి 27 వ తేదీ తోసి వేశారు.

మిస్టర్ బెంజిమన్ గారూ! యికనైనా లోకవృత్తం తెలుసుకొని ప్రవర్తించమని మా వినయ పూర్వక ప్రార్థన.

## 50 ఏళ్ళ క్రితం ఈవారం

### జన్నవాడ

ఈ దేవస్థానంలో అనాదిగా తీర్థ యాత్రికులు అమ్మ వారి వద్దకు పోయి అర్చకుల చేత పూజలు వగైరాలు చేయిస్తూ వుండేవారు. జీతం బత్తెం లేని పేష్కారు రామకిష్టయ్య గారు కొత్త హుకుం సాదరు జేసి, పోనివ్వడం లేదు. కాశీ క్షేత్రములో గూడ స్వామి వద్దకు పోయి పూజలు చేసుకోవడం ఆచారం కద్దు. ఇక్కడ అనాదిగా వున్న ఆచారాన్ని నిషేధించడం మంచి పని గాదు. మేనేజింగు ట్రస్టీ విచక్షణా దక్షులు బలరామి రెడ్డి గారు యిలాంటి విషయాలను వుపకార బుద్ధితో పరిష్కరిస్తారని కోరుచున్నాము.

\- తీర్థవాసి

## నెల్లూరు బజారు

మెలగోలుకులు

| | | | |
|---|---|---|---|
| | పుట్టి 1 కి. | రు. | 135-0-0 |
| రాగులు | పుట్టి 1 కి. | రు. | [illegible]5-0-0 |
| జొన్నలు | పుట్టి 1 కి. | రు. | 210-0-0 |
| సజ్జలు | పుట్టి 1 కి. | రు. | 225-0-0 |
| కేసర్లు | పుట్టి 1 కి. | రు. | 127-8-0 |
| బంగారు సవర (మద్రాసు) | | రు. | 54-4-0 |
| వెండి తులం (మద్రాసు) | | రు. | 1-4-0 |

## ప్రజాశక్తికి సవాల్

నీ రాజకీయ పాలసీ యొక్క బండారాన్ని బయట పెట్టుచూ, నీవెట్లు "సామ్రాజ్య ఏజంటు" వైఖరి నవలంబించావో తెల్పుచూ, లెక్కకు మించిన వ్యాసాలున్నాయి జమీన్‌రైతులో. వాటి నెదుర్కొన లేక, అభూత నిందల నేల నాపై వేస్తావు? చేతనైతే, నీ రాజకీయ ధోరణిని సమర్థించుకో, ఇదే నా సవాల్?

\- జమీన్‌రైతు

## ఎంప్లాయిమెంటు అధికారికి అంత పొగరైతే ఎట్లా?

జిల్లా ఎంప్లాయిమెంట్ అధికారి నిరుద్యోగుల పట్ల దురుసు వైఖరి ప్రదర్శిస్తున్నారు. రిజిస్ట్రేషన్ చేయించను వెళ్లిన నిరుద్యోగులను తిట్టడం, సర్టిఫికెట్లు విసురుగా బయట పారవేయడం వంటివి చేస్తున్నారు. ఆయనకంత పొగరెందుకో అర్థంకాదు. ఇటీవల నేను కేంద్ర మానవ వనరుల శాఖ నెహ్రూయువకేంద్రం నిర్వహించిన కంప్యూటర్ కోర్సు పాసై, దాన్ని అదనపు అర్హతగా రిజిస్ట్రేషన్ చేయించను వెళ్తే నాకూ ఈ చేదు అనుభవం ఎదురైంది. రిజిస్ట్రేషన్‌కు ప్రతి బంధకాలు ఏమిటి? వాటిని ఏవిధంగా సరి దిద్దాలన్న విషయం ఆఫీసులో ఏ ఒక్కరూ చెప్పరు. ఎవరికి అక్కడ పనిచేసే ప్యూను సైతం మిడిసిపడుతూ ఆఫీసుకు వెళ్లిన నిరుద్యోగులను నొక్కేస్తున్నారు. ముందుగా అతనికి తృణమో, పణమో సమర్పించాలి. లేకుంటే ప్రవేశమే దొరకదు. దశాబ్దాల క్రితం రిజిస్ట్రేషన్ చేయించు కొన్న వారికి ఒక్క ఇంటర్వ్యూ కార్డు పంపకుండా చేతులు తడిపిన వారికి ఒక్క ఏడాది సర్వీసు వున్నా పంపితే పంపారు; కనీసం నిరుద్యోగులను మనుషులుగా గుర్తించి మసలు కోండి.

నెల్లూరు — టి. శ్రీధర్

## జనవాణి

### డాక్టర్లు మరీ దోచుకుంటున్నారు

నెల్లూరులోని కొన్ని ప్రైవేట్ నర్సింగ్ హోమ్‌ల డాక్టర్లను కలవాలంటే కనా కష్టమై పోతున్నది. వారు నిర్ణయించిన ఫీజు చెల్లించినా దర్శనం దుర్లభమౌతున్నది. తలుపులోంచి తొంగి చూసిన ఏ గంటా, రెండు గంటలకో పిలుపు వస్తుంది. ఎంత మందిని చూస్తే అన్ని డబ్బులు కాబట్టి రోగికి సంతృప్తి కల్గించే విధంగా చూడడం మాని చాలా రోజులైంది. చాలీచాలని సౌకర్యాలు లేని భవనాల్లో నర్సింగ్ హోమ్‌లు నిర్వహిస్తున్న విషయం అందరికి తెలిసిందే. మొన్న 20 తేదీ మా తల్లి కాలు ఎముక విరిగింది. రాత్రి సమయం కావడం వల్ల త్వరత్వరగా కారులో నెల్లూరులోని ఒక హాస్పిటల్లో చేర్చాము. చాలా సేపటికి వచ్చిన డాక్టర్ ఎముకను జత చేయను, రూమ్ బాడుగ ఇతర ఖర్చులన్నీ కలిసి 7 వేలు అవుతాయన్నారు. గుండె లారుమని అక్కడి నుంచి పుత్తూరు వెళితే 70 రూపాయలు కూడా ఖర్చు కొరవ 9 పేజీలో

కొరవ 9 పేజీలో

# విస్కీ త్రాగితే చేరేది స్వర్గానికే!

మన సమాజంలో దాదాపు 10 నుంచి 20 శాతం మంది పురుషులు ఏదో ఒక సందర్భంలో మద్యాన్ని (Alcohol) సేవించి యుంటారు. వారిలో 10 నుంచి 15 శాతం మంది మద్యపానానికి బానిసలవుతుంటారు. వారిలో మనం ఖచ్చితంగా మద్యపానం వల్ల వచ్చే

డాక్టర్ ఐ. అనిల్ కుమార్ రెడ్డి
డయాబెటాలజిస్ట్

చెడు దోషాలను చూస్తుంటాం.

మద్యం తక్కువ మోతాదులో తీసుకొన్నా లేక తక్కువ సమయంలో ఎక్కువ మోతాదు తీసుకొన్నా అది శరీర అవయవాలన్నిటి మీదా తన ప్రభావాన్ని చూపిస్తుంది. దీర్ఘకాలంగా మద్యం సేవిస్తున్నట్లయితే దాని ఫలితాలు తెలియనివారు ఎవరూ లేరనుకొంటాను.

అసలు Alcohol అంటే ఏమిటి? అది మన శరీరాన్ని ఏ విధంగా నాశనం చేస్తుంది? నిజంగా మన శరీరానికి ఈ మందు అవసరమా?

మద్యాన్ని తరచుగా సేవించే వారి కాలేయంలో పోషక పదార్థాల నిల్వలు తగ్గిపోతాయి. బి1,బి2,బి5 విటమిన్ ఎ వంటి విటమిన్లు; జింక్, మెగ్నీషియమ్, కాల్షియం, ఫాస్ఫరస్ వంటి మినరల్సు లోపిస్తాయి. వీటి మూలంగా బుద్ధి మాంద్యము, ఆకలి తగ్గిపోవడం, నీరసం, శరీరానికి తగిలిన గాయాలు మానక పోవడం మరికొన్ని సందర్భాలలో గుండె సరిగా పనిచేయక పోవడం (Myocardial Failure) వంటివి సంభవిస్తాయి.

ఉదయాన్నే (పరకడుపున) మద్యం సేవించి నట్లయితే వారి రక్తంలో షుగర్ తీవ్రంగా పడిపోయి (Hypogly Cemia) వారు కోమాలోకి వెళ్లే ప్రమాదం వుంది.

మనకు నిత్యం కన్పించే మందు ప్రియుల్లో చాలా మందికి మద్యపానం వల్ల కలిగే చెడు దోషాలపై సరైన అవగాహన లేదనిపిస్తుంది. అందువల్లనే వారు తరచుగా మద్యం సేవిస్తూ తమకంతా బాగానే వుందనుకుంటారు. కాని ఈ వ్యసనం వల్ల శరీరంలోని అన్ని ముఖ్య కణాలు మరియు అవయవాలు చెడిపోవడం సంభవిస్తుంది. ఒకసారి ఈ మార్పులు ప్రారంభమైతే తిరిగి శరీర భాగాలు ముఖ్యంగా మెదడు, కాలేయం, గుండె, పాంక్రియాస్, జననాంగాలు తిరిగి యథాస్థితికి రావడం చాలా కష్టం.

*** త్రాగుడు మితి మీరితే గుండె పోటే కాదు, నపుంసకత్వమూ ప్రాప్తిస్తుంది!**
*** మద్యపానమూ వారసత్వంగా వస్తుందంటున్నారు డాక్టర్లు!**

ఒక విధంగా చెప్పాలంటే ఈ వ్యసనం వల్ల మన డబ్బుతో మన శరీరాన్ని మన కుటుంబాన్ని మన చేతులతో మనమే నాశనం చేసుకొంటున్నాము.

## డయాబెటిస్ వ్యాధిపై ఆల్కహాల్ ప్రభావం

మద్యం సేవించిన వెంటనే జీర్ణాశయం నుండి అత్యధిక భాగం మద్యం వేగంగా నేరుగా రక్తంలో కలుస్తుంది. మిగిలిన కొద్ది పాటి మద్యం చిన్న ప్రేగుల గుండా రక్తంలోకి నెమ్మదిగా కలుస్తుంది. మద్యాన్ని ఆహారం తోను లేదా ఆహారం తిన్న తర్వాత తీసుకుంటే నెమ్మదిగా రక్తంలో కలుస్తుంది.

మనం తీసుకొన్న మద్యం 90 శాతం కాలేయానికి చేరుతుంది. అది ఎక్కువ మోతాదులో కాలేయానికి చేరడం వల్ల కాలేయం దెబ్బతినే అవకాశం హెచ్చుగా వుంటుంది. పూర్వకాలంలో కొంత మంది వైద్య నిపుణులు తక్కువ మోతాదులో మద్యాన్ని సేవించడం ఆరోగ్యానికి హాని చేయదని భావించేవారు. కాని ఈ అభిప్రాయాన్ని ఇప్పుడు మార్చుకోవలసి వస్తున్నది.

మధుమేహం వున్న వ్యక్తి మద్యాన్ని సేవించితే వారి కాలేయంలో పిండి పదార్థం నుండి గ్లూకోసు (ఇంధనం) తయారు చేసుకొనే శక్తిని కోల్పోతుంది. ఇందువల్ల శరీర అవసరాలకు సరిపడే ఇంధనం (గ్లూకోస్) లేక వారు తరచుగా లో షుగర్‌కు లోనవుతుంటారు.

మధుమేహం వున్నవారికి రక్తంలో చక్కెర శాతం అదుపులో వుండాలంటే వారు రోజూ మాత్రలు లేదా ఇన్సులిన్ వాడవలసి వుంటుంది. వీరు మద్యం సేవించినట్లయితే ఈ మాత్రలు లేదా ఇన్సులిన్ శరీరం పై ఎక్కువ ప్రభావాన్ని చూపించి వారి ఆరోగ్యానికి హాని కలుగ చేస్తాయి. చక్కెర వ్యాధి వున్నవారు ఒకేసారి ఎక్కువ మోతాదులో మద్యం ఏ రూపం లోనైనా (బీరు, విస్కీ, బ్రాంది, వైన్, రమ్, జిన్) తీసుకొన్నట్లైతే వారు

కొరవ 9 పేజీలో

# చక్కెర ఫ్యాక్టరీ పై వరాల వాన కురిపించారు మంత్రి!

కోవూరు చక్కెర ఫ్యాక్టరీని ఐదేళ్ల పాటు నల్లేరు మీద బండిలాగా నడిపించిన సామంతు సుబ్బారెడ్డి తమ పంచమ వార్షికోత్సవాన్ని విజయో త్సవంగా జరుపుకున్నారు. 29 తేది ఫ్యాక్టరీ ఆవరణంలోనే రైతు సదస్సు పేరిట జరిగింది ఉత్సవం. సుబ్బారెడ్డి ఫ్యాక్టరీని నడిపిన తీరు, దానికి లభించిన జాతీయ స్థాయి బహుమతులు, రైతుల సంతోషం స్వయంగా చూసిన కొత్తగా చక్కెర శాఖను చేపట్టిన పాత మంత్రి పి. సాంబశివ రాజు ముగ్ధుడై పోయినట్లున్నాడు - అడిగిందే తడవుగా వేదిక పై నుంచే వరాల వాన కురిపించారు. అయి పోయిందను కున్న పదవి ఆయువు మరో ఆరు నెలలు పొడిగింప బడిందన్న శుభవార్త

## నెల్లూరు సంగతులు

కూడా సామంతుకు ఈ సభలోనే అందడం మరొక విశేషం. ఆత్మీయంగా, హార్దికంగా జరిగిన ఈ సదస్సుకు శ్రీ సామంతు సుబ్బారెడ్డి అధ్యక్షత వహించారు. ముఖ్య అతిథిగా విచ్చేసిన చక్కెర మంత్రి పి. సాంబశివరాజు ప్రసంగిస్తూ చెరకు రైతులకు ఎంతగానో ఉపయోగపడే కేన్ ఇన్‌స్పెక్టర్ కార్యాలయాన్ని నెల్లూరులో ఏర్పాటు చేస్తామన్నారు. చెరకు పరిశోధనా కేంద్రం ఏర్పాటుతో పాటు ఫ్యాక్టరీలో పనిచేసే కార్మికులను పర్మినెంట్ చేసే విషయం కూడా పరిశీలిస్తానన్నారు. పంట పై విధిస్తున్న శిస్తు తగ్గింపు విషయమై రెవిన్యూ మంత్రితో సంప్రదిస్తానని హామీ ఇచ్చారు.

70వేల టన్నుల క్రషింగ్‌తో ప్రారంభించిన కోవూరు ఫ్యాక్టరీని 3 లక్షల టన్నుల క్రషింగ్ సామర్థ్యానికి తెచ్చిన రైతులు, పాలకవర్గం ఇక ముందు కూడా అదే రీతిలో అభివృద్ధికి కృషి సల్ప గలదన్న ఆశాభావాన్ని మంత్రి వ్యక్తపరిచారు కొత్తగా జిల్లాలో మూడు చక్కెర ఫ్యాక్టరీల ప్రారంభానికి దరఖాస్తులు వచ్చివున్న విషయం వెల్లడించారు. ఫ్యాక్టరీ ఛైర్మన్ సామంతు సుబ్బారెడ్డి కోరిన కోరికలను వేటినీ మంత్రి త్రోసి వేయక హామీలిచ్చారు. ఇదే సభలో పాల్గొన్న సహకార మంత్రి కలికి యానాదిరెడ్డి 1974 లో ఫ్యాక్టరీ మంజూరు చేసిన అప్పటి ముఖ్యమంత్రి జలగం వెంగళరావును, అందుకు కృషి చేసిన పెద్దలను గుర్తుకు తెచ్చారు. జాతీయ స్థాయిలో వుత్తమమైన ఫ్యాక్టరీగా పేరు తెచ్చిన

కొరవ 8 పేజీలో





లవ్ గేమ్ వీడియో చిత్ర మూటింగుకు క్లాప్ ఇస్తున్న సినీ నటుడు చిన్న; గడ్డంతో నిలబడి వున్నది ఆ చిత్రదర్శకుడు అశహారి!

# సణుగుడు

## * సారాకు టాటా, విస్కీకి వెల్‌కం!

సారాప్రియులంతా ఈ రోజునుంచి సారాయికి టాటా చెప్పి విస్కీకి వెల్‌కం చెప్పబోతున్నారు. ఘాటైన నాటుసారా ఘుమఘుమలు విడిచిపెట్టి, కమ్మటి విదేశీ సుర సువాసనలు పీల్చే భాగ్యం కల్పించినందుకు ఆలాంధ్ర తాగుబోతుల సంఘం సభ్యులు యావన్మంది మహాఘనత వహించిన సర్కారోరికి కృతజ్ఞతలు చెప్తున్నారు. చెప్పాల్సిందే కదా మరి! బారుల్లో కూర్చుని విస్కీని త్రాగే వాళ్లని పెద్దలుగా, పాకల్లో నిలబడి సారా త్రాగేవాళ్ళని హీనంగా చూసే పాపిష్టి సమాజ ధోరణిని గమనించి, వర్గ అంతరాలు ఏర్పడడం పట్ల తెగ బాధపడి, సమసమాజ స్థాపనా లక్ష్యంలో తొలిమెట్టుగా త్రాగుబోతుల మధ్య అంతరాలు తుడిచివేసిన ప్రభుత్వాధి నేతలకు ఎన్ని దండాలు పెట్టినా తక్కువే! చచ్చి సమాధిలో వున్న కారల్ మార్క్స్ కూడా ఒకే ఒక కలం పోటుతో "వర్గభేధాలు" నిర్మూలించే ఇంత చక్కటి ఉపాయం

డోలేంద్ర

తనకు తట్టనందుకు, తన క్యాపిటల్‌లో వ్రాయలేక పోయినందుకు చింతించి వుంటాడు.

నాకొక పెద్ద అనుమానం- ఈ సారానిషేధం వెనుక అమెరికా వాడి అదృశ్య హస్తం ఏదైనా వుందా అని!

కొరవ 6 పేజీలో

# నెల్లూరు ముచ్చట్లు

విమర్శకుడు

## జిల్లాలో భూ కంపం

మహారాష్ట్రలో మృత్యు రక్కసి వలె వేలాది మందిని కబళించిన భూకంపపు ప్రకంపనాలు నెల్లూరు వరకు వ్యాపించాయి. 30 తేది తెల్లవారుఝాము 4 గంటల ప్రాంతంలో నెల్లూరు టౌన్‌లోనూ కిటికీ తలుపులు మెల్లగా కదలడం, బీరువాలకు తగిలించిన తాళాలు శబ్దం చేయడం జరిగింది. ఆ సమయంలో మెలకువగా వున్నవారు మాత్రమే దీన్ని గమనించ గల్గారు. వాకాడు, నాయుడుపేట, గూడూరు, వెంకటగిరి ప్రాంతాలలోనూ స్వల్ప ప్రకంపనాలు కన్పించాయి.

## జనార్దన రెడ్డి

మాజీ ముఖ్యమంత్రి, రాష్ట్ర కాంగ్రెస్ నేత శ్రీ నేదురుమల్లి జనార్దన రెడ్డి జిల్లా పర్యటనలో వున్నారు. ఈ రోజుతో బాలాయపల్లి, డక్కిలి మండలాల రచ్చబండ సమావేశాలు ముగుస్తాయి. రేపు (2 తేది) నెల్లూరు వచ్చి గాంధీ జయంత్యుత్సవంలో పాల్గొంటారు. మధ్యాహ్నం గూడూరులో టిటిడి కల్యాణ మండపం శంకుస్థాపన. వాకాడు గ్రామాలలో కార్యక్రమాలు. 3 తేది ఉదయం తిరుపతి మీదుగా వాయు మార్గంలో హైదరాబాదు.

## తెలుగు విశ్వవిద్యాలయం నెల్లూరు విభాగం

తెలుగు విశ్వవిద్యాలయం తరఫున నెల్లూరులో ఒక ఛాప్టర్ ప్రారంభిం చేందుకు గల సాధ్యా సాధ్యాలు పరిశీలించ డానికి ఆ వైస్ ఛాన్సలర్ ప్రొఫెసర్ పేర్వారం జగన్నాథం. గారు 4 తేది నెల్లూరు వస్తున్నారు. తెలుగు భాష, సంస్కృతి, చరిత్ర, జానపదాలు, లలిత కళలు వంటి సృజనాత్మక అంశాల పై అధ్యయనం, విద్యాబోధన చేయడం ఈ విశ్వవిద్యాలయ కార్యక్రమం. వీరికి వరంగల్, రాజమండ్రిలలో పీఠాలున్నాయి. నెల్లూరులోనూ ఒకటి స్థాపించాలని వైస్ ఛాన్సలర్ గారి అభిలాష. కానీ దురదృష్టం – ఆయనంతట ఆయన ఉత్సాహం చూపుతున్నా ముందుకు వచ్చే వారు కన్పించడం లేదు.

వివేకానంద రెడ్డి మనసు పెడితే, వి.ఆర్ కాలేజిలో ఆశ్రయం కల్పిస్తే ప్రతిష్టాత్మకము, ప్రయోజన దాయకమైన ఈ పథకం నెల్లూరుకు లభిస్తుంది. పెద్దలందరూ కలిసి వత్తిడి చేయండి!

## యానాదిరెడ్డికి మాగుంట విందు

సహకార మంత్రి శ్రీ కలికి యానాది రెడ్డికి ఎమ్పి శ్రీ మాగుంట సుబ్బరామ రెడ్డి గారు 26 తేది తన ఇంట ఖరీదైన విందు చేశారు. వెయ్యి మంది వరకు కడుపారా ఆరగించారు. వట్టి భోజనమైతే వార్త కాదు – రాజకీయాన్ని కూడా ఒక భక్ష్యంగా కలిపి వడ్డించడం వల్ల అది చర్చలోకి వచ్చింది. వచ్చిన ఎమ్మెల్యేలు, రాని ఎమ్మెల్యేలు, వచ్చినందుకు కారణాలు, రానందుకు కారణాలు వగైరా వగైరా చర్చలు జరుగుతున్నాయి. లోతుకు పోవడానికి ఇది సమయం కాదు, సందర్భం వచ్చినప్పుడు పరామర్శిద్దాం!

## ఎస్పి బదలీ వివాదం

నెల్లూరు పోలీసు సూపరిం టెండెంట్ శ్రీ టి. కృష్ణ ప్రసాద్‌ను బదలీ చేయాలంటూ కొందరు ఎమ్మెల్యేలు ముఖ్యమంత్రికి వినతి పత్రం సమర్పించారు. ప్రజా ప్రతినిధులకు కనీస పాటి గౌరవం గూడా ఇవ్వడన్నది ఫిర్యాదు. ఎస్ పి గారు దీనిని పరోక్షంగా వివాదా స్పదం చేశారు. ఎమ్మెల్యేల విజ్ఞప్తి వార్త రాగానే, ఎస్పిని బదిలీ చేస్తే ఒప్పుకోమని జిల్లా పోలీసుద్యోగుల సంఘం బెదిరించింది. వారి ప్రకటనలు రోజూ వస్తున్నాయి. ఇవి వారంతట వారు ఇవ్వడం లేదన్నది అందెరిరిగిన సత్యమే.

నెల్లూరు ఎమ్మెల్యేలంత సాధువులు లోకంలో ఎక్కడా కాగడా వేసినా దొరకరు. అధికారులకు వారిచ్చే మర్యాద, చూపే మన్నన మరే జిల్లాలోనూ వుండవు. ప్రక్కనే వున్న ఒంగోలుకు వెళ్లినా అధికారులు రాజకీయ వాదుల ముందు కుక్కిన పేనులే! తెలంగాణాకు వెళ్తే పరిస్థితి వూహించలేము. నెల్లూరు ఎమ్మెల్యేలే మనస్తాపం చెందారంటే – కృష్ణ ప్రసాద్ గారూ – మీ ప్రవర్తనలోనే ఏదో లోపం వుండి వుండాలి. ఆత్మవిమర్శ చేసుకొని సరిదిద్దుకోండి. బదలీని వివాద గ్రస్తం చేస్తే, పంతానికి పోతే నష్టం 'ఎస్పి' అనే పదవికి, దాని పరువు ప్రతిష్టలకు!

## మోసపోకండి

జమీన్‌రైతు తరఫున పనిచేస్తున్నానని ఒక యువకుడు చందాలు, ప్రకటనలు బుక్ చేసుకొని, వాటికి సరిపడా డబ్బులు కూడా తీసుకొని మోసం చేస్తున్నాడని, అతని పేరు సుధాకర్ అని తెలియవచ్చింది. అతడికి జమీన్‌రైతుకు ఎటువంటి సంబంధమూ లేదు. ఎవ్వరూ మా ఆథరైజేషన్ లేని వ్యక్తితో లావాదేవీలు జరుపవద్దని, ఇటువంటి మోసగాళ్లు తారసపడితే నేరుగా జమీన్‌రైతు ఆఫీసులో సంప్రదించ వలసిందిగా కోరుతున్నాము.

మేనేజర్

ఫోన్: 27354

## విశాఖలో నెల్లూరు కుటుంబం ఆత్మహత్య

ఆర్థిక బాధలు, కుటుంబ సమస్యలతో విసిగి పోయి నెల్లూరు బాలాజీ నగర్‌కు చెందిన బివిఎస్ ప్రసాద్ బాబు అనే యువకుడు తన ఇద్దరు పిల్లలతో కలిసి 28 తేది రాత్రి విశాఖ పట్టణంలో ఆత్మహత్య చేసుకున్నాడు. ప్రసాద్ బాబు ఎం.కాం చదివాడు. కానీ ఉద్యోగం దొరకలేదు. మెడికల్ రెప్రజెంటేటివ్‌గా పనిచేశాడు అదీ ఎంతో కాలం నిలువలేదు. హోటళ్లలో స్టీవార్డ్‌గా కూడా పనిచేశాడట. కేబుల్ టివి వంటి వ్యాపార ప్రయత్నాలూ విఫలమైనాయి. ఈలోగా భార్య చనిపోయింది. ఇద్దరు పిల్లలు; ఇంట్లో తండ్రి ఆర్థనా పరుడే కాని, లోభి అట. డబ్బు ఇవ్వక పోవడమే కాదు – నిరాదరణ. నిరుద్యోగి అన్న హేళన. నిత్యం అవమానాలు, ఇంట్లోనే వున్న పెళ్లి కాని చెల్లెలి నుంచి సమస్యలు, ఆమె శాడిస్ట్ వలె ప్రవర్తించడంతో ఎన్నో ఇబ్బందులు, పిల్లలను రాచి రంపాన పెడుతున్నా చూస్తూ కుమిలి పోవడం తప్ప ఏమీ చేయలేని నిస్సహాయత ఇవన్నీ కలగలిసి ప్రసాద్ బాబును చావుకు పురికొల్పి నట్లున్నాయి. ఆరు నెలల క్రితం భార్య కూడా ఇంట్లో పెట్టే బాధలు భరించ లేక, క్రుంగిపోయి, అనుమానాస్పద పరిస్థితులలో చనిపోయిందట. ఆమె చావు కూడా మిష్టరీ గానే వుంది.

తిరుపతిలోని ఒక స్నేహితుడి దగ్గర కొద్ది మొత్తం అప్పు తీసుకొని, ఇద్దరు పిల్లలతో కలిసి విశాఖ పట్టణం వెళ్లి నాలుగైదు రోజులు సరదాగా గడిపి, పిల్లలకు విషమిచ్చి, తానూ త్రాగి లాడ్జి గదిలోనే చనిపోయాడు! తన చావుకు తన చెల్లెలు పెట్టిన మానసిక చిత్రహింసలే కారణమని బాబు వ్రాసి పెట్టాడు. పిల్లలిద్దరూ చిన్న వాళ్లే – శ్రీనివాస వర్మ (11), మూర్తి (9) -ఇద్దరూ బాలాజీనగర్‌లోని ఒక కాన్వెంట్‌లో చదువు తున్నారు.

మనస్సెంత పచ్చి పుండుగా మారకుంటే అంత చదువు చదివి ఇంత ఘోరానికి తలపడి వుంటాడో పాపం!

## మద్య నిషేధం కమిటీ పర్యటన

మద్యపాన నిషేధం ప్రచారం కమిటీ 28 తేది నెల్లూరు వచ్చింది. శ్రీ వావిలాల గోపాల కృష్ణయ్య, శ్రీ భాట్టం శ్రీ రామమూర్తి, శ్రీ ఎంఎస్ రెడ్డి తదితరులంతా విచ్చేశారు. జిల్లా ప్రజా పరిషత్ మందిరంలో సమావేశం; రాష్ట్రంలో నెల్లూరు కలెక్టర్ వలె మద్యపాన నిషేధానికి చిత్తశుద్ధితో పనిచేస్తున్న అధికారి మరొకరు లేరని వావిలాల ప్రశంసించారు. జీప్రప ఉద్యోగులు, స్కూలు పిల్లలతో చిన్న వూరేగింపు తీశారు. రాత్రికి పొదలకూరులో నాటుసారా సామ్రాట్ రావుల అంకయ్య గౌడ ఆతిథ్యంలో సభ. సారా వ్యాపారం మానేసిన వారందరికీ వావిలాల చేతుల మీదుగా సన్మానాలు జరిపించారు; పాపం శమించు గాక!

## పోలేరమ్మ జాతర

వెంకటగిరి పోలేరమ్మ జాతర దేవాదాయ శాఖ ఆధ్వర్యంలో 6,7 తేదులలో జరుగనుంది. రాజాల నుంచి పెత్తనం వూడబెరికి, పోయిన సారి గబ్బు పట్టారు. వెంకట గిరియుల మానసాలతో సాన్నిహిత్యం కల్గిన ఈ జాతరను నిర్వహించడం దేవాదాయ శాఖ తరం కానే కాదు; చేసిన తప్పుకు చెంపలేసుకొని పాత పద్ధతి పునరుద్ధరిస్తే అందరూ సంతోషిస్తారు.

* * *



ఫ్యాక్టరీ ఉత్పాదన శక్తి వినియోగంలో అత్యంత ప్రతిభ ప్రదర్శించి 92 - 93 సంవత్సరానికి జాతీయ స్థాయిలో ఫస్ట్ ప్రైజ్ పొందింది కోవూరు చక్కెర ఫ్యాక్టరీ; 28 తేది ఢిల్లీలో కేంద్ర వ్యవసాయ శాఖ మంత్రి బలరాం జక్కర్ చేతుల మీదుగా ఆ అవార్డు అందుకుంటున్న ఫ్యాక్టరీ ఛైర్మన్ సామంతు సుబ్బారెడ్డి, ఎండి కె. సూర్యనారాయణ రావు

## నెల్లూరు సబ్ జడ్జి కోర్టులో

S.C. No. 321 / 1992

ఇండియన్ బ్యాంకు, నెల్లూరు –వాది

Vs

కందల కృష్ణమూర్తి –ప్రతివాది

To

కందల కృష్ణమూర్తి,

S/o. నారాయణ రావు,

23/1, ఎ.సి. నగర్, నెల్లూరు.

వాది పై నంబరు దావా బాకీ రాబట్టు కొను నిమిత్తం మీ మీద దావా దాఖలు చేసినందున మీరు 7.12.1993 తేదిన ఉదయం 10 గంటలకు పై కోర్టులో హాజరయి మీకు గల ఆక్షేపణాలు తెలుపు కొన వలసినది. లేని యెడల మీ పరోక్ష మందు కేసు తీర్మానించ బడును.

కొండూరు శేషారెడ్డి

వాది తరఫు ప్లీడు

## గూడూరు సబ్ జడ్జి కోర్టులో

E.P. No. 31 / 1990

O.S. No. 20 / 1990

తిరకాల కృష్ణయ్య - D.H.R / వాది

నాగలాపురం కృష్ణయ్య - J.D.R. /ప్రతివాది

### వేలం ప్రకటన

ఇందు మూలముగా యావన్మందికి తెలియ జేయడమేమనగా పై నంబరు డిక్రీ బాకీ రాబట్టుకొనుటకు గాను, J.D.R. తాలూకా ఈ క్రింది కనుపరచిన స్థిరాస్తిని పై కోర్టులో 15.11.1993 తేదిన ఉదయం 10.30 గంటలకు వేలం వేయబడును.

### షెడ్యూలు

Item No. 1

నెల్లూరు జిల్లా రాపూరు మండలం -రాపూరు సబ్ రిజిస్ట్రారులో చేరిన తూమాయి గ్రామంలోని నాగలాపురం క్రిష్ణయ్య తాలూకు స్థిరాస్తి వివరం.

పట్టా నం. 324, సర్వే నం. 168 విస్తీర్ణం. య. 2.94 సెంట్లు మెట్ట భూమికి హద్దులు.

తూర్పు: కల్లు వాగు; దక్షిణం: యద్దల వెంకట సుబ్బయ్య పొలం; పడమర: గోపిసాని పుల్లయ్య పొలం; ఉత్తరం: సవిటివాగు

D.H.R. విలువ రూ. 30,000/-

అమీనా విలువ రూ. 32,340/-

Item No. 2

నెల్లూరు జిల్లా రాపూరు మండలం, రాపూరు సబ్ రిజిస్ట్రారులో చేరిన తూమాయి గ్రామంలో తూమాయి పంచాయితీలో చేరిన 30 అంకణముల స్థలం 20 అంకణముల రెడ్డి. 3 అంకణముల కట్టుబడి గల పూరి యిల్లు, 1 1/2 అంకణముల వరండా, 3 కొట్టాములకు హద్దులు.

తూర్పు: మహమలూరు శంకరయ్య మిద్దె; దక్షిణం: పాలగల్లు పెంచలయ్య వామి దొడ్డి; పడమర: డొంక; ఉత్తరం: వీధి

D.H.R. విలువ రూ. 5,000/-

అమీనా విలువ రూ. 15,000/-

Note:1 వ అయిటము మీద 11.8.1979 తేదిన J.D.R. రాపూరు L.M.B. వారికి రూ.2,000/- మరియు సదరు 11.8.1979 తేదిన మరో రూ.2,000/- లకు అదే బ్యాంకులో ఉన్న అడుమాన బాకీలకు లోబడి.

**టి. రఘురామిరెడ్డి,**

D.H.R. తరపు న్యాయవాది, గూడూరు





## నెల్లూరు సబ్‌జడ్జికోర్టులో

O.S.No.260 of 92

వైశ్యా బ్యాంకి - వాది

నెల్లూరు- 2

Vs

1. ముప్పవరపు రమేష్ చౌదరి

2.జి.వి.ప్రసాదు, 3.యం.సుహాసిని

వగైరా... సౌతు ఆములూరు

...ప్రతివాదులు

ఈ నంబరున వాది ప్రోనోటు బాకి రాబట్టు కొనుటకు దావా చేసి యున్నందున 2,3 ప్రతి వాదుల నోటీసు నిమిత్తం 13-10-93 ఉ.10-30గ.లకు వాయిదా వేయబడి యున్నది. 2,3 ప్రతివాదులు హాజరై కోర్టులో తెలుపు కొనియెడల పరోక్ష మందు తీర్మానించ బడును.

**చింతా శ్రీరామమూర్తి**

వాదుల అడ్వొకేటు,

689, శంకరాగ్రహారం, నెల్లూరు

## ప్రొద్దుటూరు సబ్ జడ్జి కోర్టులో

S.C. No. 106 / 93

స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా రెప్రజెంటెడ్ బై యిట్సు బ్రాంచి మేనేజర్, స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా ప్రొద్దుటూరు -వాది

Vs

కరమలపూటి సురేష్ బాబు వయస్సు సుమారు 35 సం.లు,

S/o. సుబ్బరాయుడు, హిందు,

వ్యాపారం, సాకిన్, నెల్లూరు.

D.No. 8/159, మాదాల బాలతిమ్మయ్య సత్రం, రంగ నాయకుల పేట దగ్గర, నెల్లూరు టవున్ - ప్రతివాది

పై నంబరు దావాలోని వాది బ్యాంకి వారికి ప్రతి వాది అయిన నీవు చెల్లించ వలసిన రు. 7,987.00 లకు దావా దాఖలు చేసి యుంటున్నారు. సదరు దావాలో ప్రతివాది అయిన నీవు హాజరగుటకు గాను 26.10.93 తేదికి వాయిదా యుంటున్నది. గనుక సదరు 26.10.93 తేది పగలు 10.30 గంటలకు ప్రతివాది అయిన నీవు పై కోర్టు వారి ఎదుట హాజరై ఏదైన ఆక్షేపణలు వున్న ఎడల తెలుపుకో వలసినది లేనంతట ఎక్సుపార్టీగా తీర్మానించ బడును.

**ఎం. ఉదయకుమార్**

వాది అడ్వొకేటు, ప్రొద్దుటూరు

## జిల్లా వార్తలు

(2 పేజీ తరువ)

చెప్పుకో మన్నారట. ఎంఆర్‌ఓకి వినతి పత్రం ఇచ్చినా చర్య లేదు. బదిలీ మీద వెళ్లే వారు కూడా ఇల్లు తమ తాత సొత్తయినట్లు ఇతరులకు బాడుగకిచ్చి, నెలనెలా డబ్బు దండు కుంటున్నారట.

మరీ ఇంత దౌర్జన్యమేమిటండి - కలెక్టర్ గారికి చెప్పి చూడ కూడదూ!

### ఉదయగిరిని కరువు ప్రాంతంగా ప్రకటించాలి!

ఉదయగిరిలో కరువు వికృత రూపంలో ప్రజలను పీడిస్తున్నదని, తాలూకా అగ్రికల్చరల్ మార్కెట్ కమిటీ అధ్యక్షుడు శ్రీ ఎం. రవీంద్ర రెడ్డి ఆవేదన వ్యక్తం చేస్తున్నాడు. మెట్ట పైర్లు ఎండి పోయాయి. పెట్టిన ఖర్చు కూడా వచ్చేట్లు లేదు. నార్లు పోస్తే ఎండలకు మాడి పోయినాయి. మళ్లీ నారు పోయడానికి చినుకు వాన లేదు. ప్రభుత్వం కరుణించి, కాటకాన్ని గమనించి తక్షణం ఉదయగిరిని కరువు ప్రాంతంగా ప్రకటించి, సహాయ పడాలని రవీంద్ర రెడ్డి కోరుతున్నారు.

### ఆర్టీసీ నిర్లక్ష్యం— పోస్టల్‌కు సంకటం

అల్లూరు రూట్‌లో తిరిగే ఆర్టీసి బస్సుల కండక్టర్లు పోస్టల్ బ్యాగుల పట్ల చూపిస్తున్న నిర్లక్ష్య వైఖరి పోస్టల్ శాఖకు, ప్రజలకు సంకటంగా తయారయ్యింది. పోస్టల్ బ్యాగులు అత్యవసర సర్వీసు క్రింద తీసుక వెళ్లాలన్న నిబంధన కండక్టర్ చేతిలో వుండే చార్టులో వున్నా పాటించక పోవడం వల్ల సమస్య వుత్పన్న మవుతుంది. దీని వల్ల రోజుల తరబడి వుత్తరాల బట్వాడా నిలచి పోయి, చేరాల్సిన గమ్య స్థానానికి అత్యవసర వుత్తరాలు, మనియార్డర్లు, రిజిష్టర్ పార్శిల్లు చేరక ప్రజలు పాట్లు పడుతున్నారు. ప్రతి దినం అల్లూరు పోస్టాఫీసు నుండి బ్యాగు సాయంత్రం 4.30 గంటలకు బస్టాండ్ చేరుతుంది. ఆ టైము నుండి వచ్చే బస్సులు దాన్ని తీసుకో వెళ్లను తిరస్కరిస్తుండడంతో ప్రతి రోజూ బ్యాగును చేర్చే వ్యక్తి, కండక్టర్లతో ఘర్షణ పడ వలసి వస్తుంది. ఎవరో ఒక కండక్టర్ దయ తలచి గమ్య స్థలమైన నెల్లూరు చేర్చేసరికి ఆర్.ఎం.ఎస్‌కు వ్యాన్ వెళ్లి పోతుంది. అక్కడ నుండి పోస్టల్ బ్యాగులు తిప్పలు మొదలవుతాయి. డ్రైవర్లు పట్టించుకోక పోవడం వల్ల బస్సులోనే తిరుగు తుంటాయి. పోస్టల్ మెయిన్ బ్రాంచ్ ఫిర్యాదు చేసిన మీదట ఎక్కడోక్కడ బ్యాగు అల్లూరు సిబ్బంది పట్టుకొని ఆర్.ఎమ్.ఎస్. చేర్చుతారు. ఈ తంతు గత మూడు నెలలుగా అధికమై, వారం రోజుల తరువాత బ్యాగు చేరిన సంఘటనలు ఎన్నో వున్నాయి. ఈ వైఖరి వల్ల రోజుల తరబడి వుత్తరాలు చేరక ప్రజలు పడుతున్న పాట్లు వర్ణనాతీతం. ఈ విషయాన్ని పోస్టల్ వున్నతాధికార్లకు ఇక్కడి పోస్టుమాస్టర్ విన్నవించినా వారు ఆర్టీసి అధికార్లకు నత్తనడక

సందేశ మందిస్తున్నట్లుంది. ప్రజా సౌకర్యమే పరమావధి అని చెప్పే ఈ రెండు శాఖల పుణ్యాన బోటలిగా ప్రజలు పాట్లు పడుతున్నారు. మరి సరిదిద్దే నాధుడేడీ!

### కలిచేడు వివరణ

కలిచేడులోని గనుల భద్రతా వారోత్సవాలు ఘనంగా జరిగాయని మైకా మైన్స్ సేఫ్టీ వీక్ సెలబ్రేషన్ కమిటి కార్యదర్శి డి. సుబ్రహ్మణ్యం తెలుపుతున్నారు. గతవారం 'జమీన్‌రైతు' వార్తలో పేర్కొన్నట్లు గాక అతిథులంతా వచ్చారట. గుర్తింపు పొందిన సంఘ కార్మిక నాయకులెవ్వరూ సభకు హాజరు కానందున మాట్లాడే అవకాశం సమస్య రాలేదంటున్నారు. గతంలో వాటితో పోల్చుకుంటే ఈ సంవత్సరపు వుత్సవానికి సరి రాదంటున్నారు.

### కనుపర్తిపాడు సమస్యలు

కనుపర్తిపాడు గ్రామంలో వున్న ఏకైక మంచి నీటి మడుగుతోనే గ్రామ అవసరాలు తీరక ప్రజలు పాట్లు పడవలసి వస్తుంది. చాలా వరకు నిత్యావసరానికి కావల్సిన మంచి నీటికి, పశువులకు, బట్టలు వుతికేందుకు ఈ మడుగు పైనే ఆధార పడి వున్నారు. బట్టలు వుతకడం, పశువులు దిగడం వల్ల నీరు కలుషితం కావడం జరుగుతుంది. ఇటీవల ఇక్కడ వుతికిన బట్టలు ధరించి ప్రజలు అంటు వ్యాధుల పాలయ్యారు. ప్రభుత్వాధికారులు ఈ విషయాలను గ్రహించి తమ గ్రామంలో ఒక మంచి నీటి పథకంతో దోభీఘాట్ నిర్మించి పుణ్యం కట్టుకోవాలని కనుపర్తిపాడు గ్రామస్తులు కోరుతున్నారు.

### సణుగుడు

(4 పేజీ తరువ)

ఐ.ఎం.ఎఫ్ లోన్లు, ప్రపంచ బ్యాంకు అప్పులు ఇబ్బడి ముబ్బడిగా ఇచ్చి భారత దేశాన్ని బ్రహ్మాండంగా అభివృద్ధి చేయాలని కంకణం కట్టుకున్న ఇంగ్లీషు దొరలకు ఆంధ్రులు అనాగరికంగా పాకల్లో చేరి నాటుసారా త్రాగడం అవమానంగా కన్పించి వుండవచ్చు. తామిచ్చే డాలర్లు స్కాచ్ విస్కీకి ఖర్చయితే వారికి సంతోషం కాని, పుచ్చు కల్లు, సారాలకు వెచ్చిస్తే డాలర్ ప్రతిష్టకే లోపం కదామరి! ఆరు కోట్ల ఆంధ్రుల్ని సారా పాకల హీన స్థితి నుంచి పైకి తెచ్చి, ఎసి బార్‌ల స్థాయికి పెంచడమూ తమ అభివృద్ధి పథకంలో భాగంగా చేర్చుకొని సైగ్గా ముఖ్యమంత్రి చెవిలో మంత్రోపదేశం చేసి సారా నిషేధపుటుత్తర్వు తెచ్చారా అని నా సందేహం! ఐఎంఎఫ్ గుంజిళ్ళు తీయమన్నా "ఎస్ బాస్" అంటూ లెక్కపెట్టి వందసార్లు క్రిందకు పైకి లేచే కేంద్ర సర్కారున్నప్పుడు ... సారా వద్దని నోరారా ... దమ్ములు ఆంధ్ర దొరతనానికి వుంటాయా? విస్కీ ఒక్కటే అమ్మితే పూరికీ డిస్టిలరీ పెట్టొచ్చు; విధి

లేక బీరు పరిశ్రమ స్థాపించవచ్చు. వాటి పేరుతో మరెన్నివేల కోట్ల డాలర్ల అప్పో తెచ్చుకోవచ్చు. పెద్ద పెద్ద పరిశ్రమాధిపతుల ఇళ్లు బంగారంతో తాపడం చేయవచ్చు. సారాతో ఏమి జరుగుతుంది? కంపు తప్ప!

ఎట్లయితేనేమి - ప్రభుత్వ సారాయి చరిత్రలో కలిసి పోయింది. వెరైటీ కోసం కావాలంటే నాటు సారా వుండనే వుంది! ప్రభుత్వ సారా అంగళ్లు మూసేసి, మెషిన్లు, గిషన్లు పాత ఇనుము క్రింద అమ్మేయడం చిటికలో పని; కానీ నాటు సారా తయారీ ఆపడమంటే మాత్రం కొండల్లో దాగిన చిట్టెలుకను పట్టడం క్రిందే లెక్క!

సారా పోయి విస్కీ వచ్చినా పల్లెల్లో అది అందుబాటు కాదు కాబట్టి, త్రాగుడు వ్యసనం ముప్పాతిక భాగం పైన తగ్గి పోతుందని ఆశించాలి! గజ త్రాగుబోతులను ఎవ్వరూ మార్చలేరు. ప్రక్కనే దొరుకు తున్నది కాబట్టి ఒక చుక్క వేసుకుందాం అనుకొని పాకలో దూరే వారికి ఈ నిషేధం వరం వంటిదే. ఎవరి కోసం, ఎందు కోసం చేసినా సారా నిషేధం ఆహ్వానించ దగినది, అభినందించ దగినది. కాని సారా మాని విస్కీ త్రాగండన్నట్లు ప్రభుత్వం ప్రవర్తించడం ఘోరం. చవక బారు విస్కీలు మార్కెట్‌లోకి తెచ్చి పేదవాడి పొట్ట కొట్టే కంటే సారానే కొనసాగించడం మేలని అలస్యంగా అర్థం చేసుకో బోతారు.

ఎక్సైజ్ అధికారులకు మాత్రం పండుగ. ఇప్పటి వరకు వేలల్లో వుండిన వారి ఆదాయాలు ఇక నుంచి లక్షల్లోకి చేరుకో బోతాయి. నాటు సారా, కాపుడు సారా ప్రవాహాలు ఎంత పారితే వారి కంత లాభం. త్రాగవద్దని జనానికి హిత బోధ చేసే ముందు, కక్కుర్తిగా వ్యవహరించ వద్దని ఎక్సైజ్ వారికి హుకుం జారీ చేయకుంటే శ్రమంతా వృధా ఔతుంది!

### భూకంపం

(మొదటి పేజీ తరువ)

కలిపేసుకున్నది; అంతకు రెండింతల మందిని ఆస్పత్రి పాల్జేసింది; వేలాది ఇళ్లు కూల్చింది! 30 తేది వేకువ ఝాము ఘడియల్లో, అందరూ ఆదమరచి నిద్రపోతున్న నిశిలో, గుట్టు చప్పుడు గాకుండా ప్రళయం సృష్టించింది. మహారాష్ట్రలో సంభవించిన ఈ భూ కంపం చరిత్ర ఎరుగనిది.

ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్ర సరిహద్దులలోని లాతూర్, ఉస్మానా బాద్ జిల్లాలు భూకంపానికి అధికంగా గురైనాయి. రెండేళ్ల క్రితం ఉత్తరప్రదేశ్‌లోని ఉత్తర కాశీలో భూమి ప్రకంపించి 1500 మంది చనిపోయారు. దాని కంటే ఇది తీవ్రమైనది. 6 వేల మంది చనిపోయినట్లు ఇప్పటి అంచనా. కూలిన ఇళ్లు, ఇతర భవనాల శిథిలాలు తొలగిస్తే కాని మొత్తం ... తేలదు.

ఇది జాతీయ విపత్తు. ... యావత్తు మానవతా దృక్పథంతో వ్యవహరించి ప్రతి స్పందించాల్సిన ఆపద.

# బాలుతో డ్యూయెట్లు— లక్ష్మి కోరిక

"పుణ్యాలు పుదిదానదు" తమిళ చిత్రంలో లక్ష్మి, ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం నాయికా నాయకులు. ఇద్దరూ డాక్టర్లు. "బాలు గారికి శరీరం ఎంత గొప్పదో, శరీరం అంత పెద్దది. ఆయన హీరోయిన్‌తో చెట్లు చుట్టూ తిరిగి డ్యూయెట్ పాటను చిత్రీకరిస్తే, క్రమక్రమంగా లావు తగ్గుతారు. ఈ పిక్చర్‌లో అలాంటి సాంగ్ ఒకటి అదనంగా పెట్టకూడదా?" అని నవ్వుతూ దర్శకుడు షాకీర్‌తో లక్ష్మి అంది. "భలే ఐడియా" అని బాలు కూడా నవ్వేశారు.

## అర్జున్ చిత్రాలకు గిరాకీ

అర్జున్ నటించిన "జెంటిల్‌మెన్" తమిళ చిత్రం డబ్బింగ్ హక్కులను నిర్మాత ఎ.ఎం. రత్నం 76 లక్షలకు కొన్నారన్న వార్తతో తమిళ, కన్నడ భాషల్లో బాగా ఆడని అర్జున్ పాత చిత్రాలను సైతం డబ్ చేయడానికి పలువురు నిర్మాతలు హడావుడి పడుతున్నారు. అర్జున్‌తో ఒకప్పుడు తెలుగులో చిత్రాలు తీసి, అతడ్ని మరచిన కొందరు నిర్మాతలు కూడా అతని డబ్బింగ్ చిత్రాల కోసం పోటీ పడుతున్నారంటే ఒక్క 'జెంటిల్‌మెన్' చిత్రంతో అర్జున్ ఎంతగా ఎదిగాడో తెలుస్తోంది. ఇది చిత్ర ప్రపంచం కదా?

# గ్లామర్ పాత్రలతో విసుగు

"గ్లామర్‌గా నటించి నందుకు ప్రేక్షకులకు మొహమ్మొత్తి లేదేమో గాని, నాకు మాత్రం విసుగు పుట్టేసింది. చక్కని నటను ప్రదర్శించేందుకు అనువైన పాత్ర ఏదైనా లభిస్తుందేమో నని ఇంత కాలం ఎదురు చూశాను. ఇక లభించే సూచనలు కనిపించడం లేదు. అందుకే చక్కా పెళ్లి చేసుకొని ఓ ఇంటి దాన్ని అయిపోవాలని ఉంది" అంది పూజాబేడి. ఈమె బాయ్ ఫ్రెండ్ ఫరాన్‌తో మూడేళ్ల నుంచి వ్యవహారం నడుపుతోంది. మధ్యలో ఇద్దరికీ ఏవో భేదాభిప్రాయాలొచ్చి విడిపోయారు. మళ్లీ ఒకటయ్యారు. "ఇక విడిపోయేది లేదు. శాశ్వతంగా కలసి మెలసి ఉండడానికి ఈ 'పెళ్లి'" అందామె. ఈమె హైందవ వనిత. ఫరాన్ మహమ్మదీయుడు. అందుకే రిజిస్టర్ మారేజ్ అట.

## శ్రీనాథ కవి సార్వభౌముడు అక్టోబర్ 21

ఎన్టీఆర్ ప్రధాన పాత్ర నిర్వహించిన పై చిత్రం అక్టోబర్ 21 న విడుదల చేయడానికి సన్నాహాలు జరుగుతున్నాయి. రచన: ముళ్లపూడి వెంకట రమణ, దర్శకత్వం: బాపు

# శ్రీదేవి అమితాబ్ ప్రచారం

నవంబర్, డిసెంబర్ మాసాలలో ఉత్తర ప్రదేశ్, మధ్యప్రదేశ్, రాజస్థాన్, హిమాచల ప్రదేశ్‌లలో జరిగే ఎన్నికలకు ప్రచారం చేయడానికి అమితాబ్ బచన్‌ను, శ్రీదేవిని ఆహ్వానించినట్లు మరి కొందరు తారలనూ ఆహ్వానించ బోతున్నట్లు కేంద్ర మంత్రి ప్రణబ్ ముఖర్జీ తెలిపారు. తాను రాజకీయాలకు దూరంగా ఉంటానని ఆ మధ్య అమితాబ్ చేసిన ప్రకటన చాలా మందికి గుర్తుండే వుంటుంది.

## మద్రాసు సినిమా వార్తలు

# కృష్ణసేనా? వానర సేనా?

గతంలో అభిమాన సంఘాల పట్ల సినీ ప్రముఖులకు ఉన్న విశ్వాసం క్రమక్రమంగా తరగి పోతున్నందుకు కొన్ని అభిమాన సంఘాల వారు చేసే దౌర్జన్యాలు కారణాలుగా చెప్పుకోవచ్చు. అభిమాన సంఘాల వారు బాధ్యతతో ప్రవర్తిస్తూ, ఏదైనా సూచనలు చేయవచ్చు గాని, చిత్ర నిర్మాణ విషయంలో జోక్యం కల్గించు కొన్నందు వల్ల చివరకి ఇబ్బంది పడేది వారే. "రౌడీ అన్నయ్య" చిత్రం నిర్మాణంలో ఉండగా పాటల విషయమై కృష్ణ యువ సేన పేరుతో కొందరు దర్శక నిర్మాతలకు హెచ్చరికలు పంపారు. కరపత్రాలు కూడా పంపారు. కృష్ణ సిల్క్‌స్మితలపై చిత్రీకరించిన ఒక పాట పై సెన్సార్ వారు ఆక్షేపణలు చేయడంతో ఆ పాటను తొలగించి విడుదల చేయ వలసి వచ్చింది. ఆ పాటను మళ్లీ రీషూట్ చేయాలంటూ దాదాపు పాతిక మంది ఆ చిత్ర నిర్మాణ కార్యాలయం పై దాడి చేసి కార్ల అద్దాలను పగులగొట్టి, టెలిఫోన్ వైర్లు కట్ చేసి, నానా బీభత్సం సృష్టించారు. అప్పటికే "చెంగావి చీర కట్టి – సిరిమల్లె పువ్వు పెట్టి" అనే పాటను షూట్ చేసి వున్నప్పటికీ కృష్ణ స్మితలపై మళ్లీ అదే పాటను చిత్రీకరించడం జరిగింది. ఇది సెప్టెంబర్ 21 నుంచి అన్ని కేంద్రాలలోని ప్రింట్‌లతో చేర్చి ప్రదర్శించ బడుతోంది కూడా. "ఇలాంటి అక్రమాల వల్ల హీరో ఇమేజ్ దెబ్బ తినదా? ఎలాంటి ప్రోత్సాహం లేకుండా అభిమానుల మని చెప్పుకుంటున్న వీరు ఇలాంటి దురాగతాలకు పాల్పడే అవకాశముందా? ఇందువల్ల ఎవరు సాధించ బోయేదేముంది? అని డైరక్టర్ భరద్వాజ తన నిరసనను వ్యక్తం చేశారు. అదీ గాక హైదరాబాద్‌లోని కృష్ణ అభిమాన సంఘాలలో కొన్ని వర్గాలున్నాయట. వాళ్లల్లోని వైషమ్యాల వల్ల ఒక వర్గం పై దుష్ప్రచారం జరగడానికి మరో వర్గం ఇలాంటి

## "మగరాయుడు" కథ – కమామిషు

రెండు మూడు చిత్రాలు విజయ వంతమైతే ఆత్మవిశ్వాసం పెరిగి మనసు కాస్త అదుపు తప్పడం సహజమే. డైరక్టర్ ఇ.వి.వి. సత్యనారాయణ ఎంపిక చేసిన "మగరాయుడు" చిత్ర కథ గురించి ఆయనే చెప్పారు. "నాయికా నాయకలు అకస్మాత్తుగా ఒక ప్రమాదంలో అసువులు కోల్పోతారు. యమలోకం చేరుకుంటారు. అత్యాధునికంగా ఉన్న ఆ లోకంలో కంప్యూటర్ దోషం వల్ల ఆయువు మూడకముందే హీరో అక్కడి కొచ్చాడని తెలుస్తుంది. అతడ్ని మళ్లీ

# నవ్వుల జల్లు: దొంగల్లుడు

### చిత్రసమీక్ష

### గ్రిద్దలూరు గోపాలరావు

మనిషి మొత్తం జీవితంలో పొందగల గొప్ప వరమేమిటి అనగానే ఒక్కో మనస్తత్వం గల వారు ఒక్కో రకంగా చెప్తారు. కాని అన్ని మనస్తత్వాల వారు పొంద వలసిన వరం "నవ్వు". మనిషి తన జీవితంలో ఎప్పుడూ "నవ్వు" తూ వుండటమనేది అందరూ పొంద వలసిన వరం. కాని దాన్ని ఏ కొందరో పొంద గలుగుతారు అపురూప వరంగా. అందరూ నవ్వుతూ హాయిగా జీవితం గడపాలని ఆశిస్తారు. ఎందుకంటే "నవ్వు" దుఃఖాన్ని పోగొట్టుంది. మానసిక వ్యాధులను కుదురుస్తుంది. సంతోషం కలిగిస్తుంది. సంతోషం సగం బలం కదా! "నవ్వు" ఆరోగ్యం కలిగిస్తుంది. ఆరోగ్యమే మహాభాగ్యం కదా! అందుకే రోజులో ఒక్క సారైనా హాయిగా నవ్వుకోవాలి. పూర్వ కాలం రాజులు బాగా నవ్వించే వారిని హాస్య విదూషకులుగా తమ ఆస్థానాల్లో వుంచుకునే వారు. ఈనాడు రాజుల బదులు ప్రజలను నవ్వించేందుకు కొన్ని సినిమాలు తయారు చేస్తున్నారు. "నా కొడుకు డాక్టరూ కానక్కర్లేదు, ఏక్టరూ కానక్కర్లేదు. ఒక మంచి దొంగగా తయారై మన వంశం పేరు నిలబెట్టే చాలురా" – అది ఒక తండ్రి (వేలు) ఆశీర్వాదము – తన సుపుత్రునికి ( సుమన్). సామాన్యంగా ఏ తండ్రీ తన కొడుకును ఈ విధంగా దీవించడు. ఈ దీవెనలో వ్యంగ్యం వుంది. సున్నితమైన హాస్యం వుంది. అందులోనూ, మంచి హాస్య నటుడు వేలు నోటి నుంచి వచ్చిన మాటలివి. అందుకే అక్కడ హాస్యం పండింది.

తండ్రి దీవెనకు స్పందించిన కుమారుడు "నాన్నా నా కళ్లు తెరిపించావు. చేసిన దొంగ తనం చెయ్యకుండా, రకరకాలుగా చేస్తూ

కొరవ 9 పేజీలో



భైరవద్వీపం చిత్రంలో బాలకృష్ణ, రోజా

అఘాయిత్యాలు చేస్తున్నారని తెలిసి, భూమికి పంపించే లోపున అక్కడ హీరో కృష్ణ వాళ్లకు హితవు చెప్పి అతని భౌతిక కాయానికి దహనం జరిగి కూడా ప్రయోజనం లేక పోయింది.

కొరవ 8 పేజీలో

## నెల్లూరు సంగతులు

(4 పేజీ తరువాయి)

ఛైర్మన్ పదవి కాలాన్ని ప్రభుత్వం మరో ఆరునెలలు పొడిగించిందన్న విషయాన్ని స్వయంగా వెల్లడించారు. ఫ్యాక్టరీకి చెరకు తెచ్చే రైతులు వీటి బకాయిలు, చెల్లించకుండా తెచ్చే రికవరీ శాతాన్ని పెంచుకోవాలని చక్కెర ఫ్యాక్టరీ కమీషనర్ శ్రీ ఎ. దాస్ కోరారు. ప్రస్తుతం రికవరీ శాతం 9.6 వుందన్న విషయం గుర్తు చేశారు. నెల్లూరు ఎమ్మెల్యే జె.కె.రెడ్డి, ఎస్ సి.వి. శేషారెడ్డి, డి.సి.సి.బి. ఛైర్మన్ వేమారెడ్డి రామచంద్రారెడ్డి కూడా సభలో మాట్లాడారు.

### వివేకానందరెడ్డికి సన్మానం

గత వారంలో అంతర కళాశాలల క్రీడా పోటీలు విజయవంతంగా నిర్వహించినందుకు అనం వివేకానందరెడ్డిని పొదలకూరు ఎ.సి.సుబ్బారెడ్డి మెమోరియల్ బిల్డింగ్‌హామ్ యూత్‌సెంటర్ వారు 26తేది వి.ఆర్. హైస్కూల్ లో మునిసిపల్ కమీషనర్ కెప్టెన్ డి.వి.రెడ్డి చేతులమీదుగా సన్మానింప జేశారు. ముఖ్య అతిథిగా విచ్చేసిన అనం రామనారాయణరెడ్డి ఎంతటి కష్టకార్యమైనా సులభంగా నిర్వహించగల సమర్థుడు వివేకానందరెడ్డి అని ప్రశంసల జల్లు కురిపించారు. పొదలకూరు యూత్ సెంటర్‌ను కూడా పొగడ్తలతో ముంచెత్తారు. సన్మాన గ్రహీత వివేకానందరెడ్డి మాట్లాడుతూ మా కుటుంబానికి స్వర్గీయ ఎ.సి. సుబ్బారెడ్డి ఎన్ని కోట్లు గుమ్మరించినా కావలసిన ప్రజాభిమానాన్ని సంపాదించి పెట్టి పోయారు మాకు ఆర్థిక బలం లేకపోయినా ప్రజాబలం మమ్మల్ని బ్రతికిస్తుందన్నారు; దీని అంతరార్థం మనం వెతుక్కోవాలా! అంతర కళాశాలల క్రీడల పోటీలకు లభించిన ఆదరణ చూసిన తర్వాత అంతర యూనివర్సిటీ క్రీడల పోటీలు నిర్వహించాలన్న ఆసక్తి కల్గుతుందన్నారు.



## శివారెడ్డి పద్యాలు

### మాగుంట డిన్నరు

కవికి దగ్గరైతె కలికి యానాదిరెడ్డి
మంత్రి తిరుగు లేదు మాట జెపితె
మాపటేళ నైటు మాగుంట విందంటె
కవిని పొయ్యెరెట్ల కల్లు పొరలు!

### నిన్న మొన్నటోడ్ని

నిన్నమొన్నటోన్ని నీ కంటె పసివాన్ని
కొదిప్రాయపోన్ని కుర్రవాన్ని
ఇంతలోనె కవికి యేజి యెనబదంటె
సిగ్గు సిగ్గు ఎంత చిన్నతనము

జిల్లా ఆయిల్ మిల్లర్స్ అసోసియేషన్‌తో పాటు వివిధ క్రీడా సంఘాలు, వెటరన్ క్రీడాకారుడు డాక్టర్ శ్రీధర్‌రావు, వివేకానందరెడ్డిని పూల మాలలతో ముంచెత్తారు.

### వృద్ధులను ఆదుకోవాలి

24 తేది వ్యాస జయంతిని శ్రీ స్వయంపాకుల శ్రీనివాసరావు తన తండ్రి జ్ఞాపకార్థం టౌన్‌హాల్‌లో చక్కగా నిర్వహించారు. వక్తగా విచ్చేసిన కళా ప్రపూర్ణ మరుపూరు కోదండ రామరెడ్డిగారు కీర్తిశేషులు శ్రీ వెంకట శేషయ్య శాస్త్రి గారు బహు జనామోదాన్ని పొందిన జ్యోతిష్యవేత్తని ప్రశంసించారు. డాక్టర్ పి. మధుసూదన శాస్త్రి మాట్లాడుతూ వార్ధక్యంలో వృద్ధులను ఆదుకునేవారు కరువయ్యారు. జవసత్వాలున్నంత కాలం సంతానం, కుటుంబ సభ్యుల పోషణకు శక్తినంతా ధారబోసినవారు చివరి దశలో నిర్లక్ష్యానికి గురవుతున్నారు. అందువల్లే వృద్ధ జనాశ్రయాలు అవసరమవు తున్నాయన్నారు. సభారంభంలో నెల్లూరు ప్రభుత్వ సంగీత నృత్యకళాశాల ప్రిన్సిపల్ కొమండూరి శేషాద్రి గారి గాన కచ్చేరి శ్రోతలనలరింప జేసింది. అధ్యక్ష స్థానాన్ని డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి అలంకరించారు. చివరన సాహిత్య సదస్సు కార్యదర్శి శ్రీ చతుర్వేదుల నరసింహమూర్తి కృతజ్ఞతలు వెల్లడించారు.

### రిటైర్డ్ ఉద్యోగుల ఆందోళన

దీర్ఘకాలికంగా పరిష్కారానికి నోచుకోకుండా వుండే తమ సమస్యలను తీర్చుకునేందుకు రిటైర్డ్ ఉద్యోగులు సైతం పోరుబాటన నడవాలని నిశ్చయించుకున్నారు. కలెక్టరేట్ ఎదుట అక్టోబర్ 5 నుంచి 7 తేది వరకు రిలే నిరాహార దీక్షలు చేస్తారట. పెన్షన్ పెంపుదల విషయమై కృష్ణమూర్తి నివేదిక ఆమోదం, నిమ్స్‌లో ఉచిత వైద్య పరీక్షలు, కాంగ్రెస్ పార్టీ ఎన్నికల మేనిఫెస్టోలో ప్రకటించిన రాయితీల అమలు వీరి తక్షణ డిమాండ్లు. తమ కోరికల పట్ల తగు విధంగా స్పందించకుంటే మరింతగా ఆందోళనను ఉధృతం చేస్తామని అసోసియేషన్ కార్యదర్శి రిటైర్డ్ డిప్యూటి కలెక్టర్ టి. దొరస్వామి చెబుతున్నారు.

### "డిసెంబర్31" టెలిఫిలిం ప్రారంభం

నెల్లూరుకు చెందిన విజయశ్రీ ఫిలిమ్స్ అధినేతలు ప్రసాద్, సుబ్రహ్మణ్యం, గోపాలరావు నిర్మిస్తున్న 'డిసెంబర 31' టెలిఫిలిం ఆదివారం అప్సరా లాడ్జిలో ప్రారంభమయ్యింది. సినీ దర్శకుడు కావూరి సాంబశివరావు ముహూర్తపు షాట్‌కు దర్శకత్వం వహించగా, నెల్లూరు కోఆపరేటివ్ మార్కెటింగ్ సొసైటి ఉపాధ్యక్షులు ఎ. బ్రహ్మరెడ్డి తొలిక్లాప్ ఇచ్చారు. తెలుగు గంగ పథకం సూపరింటెండెంట్‌గా పనిచేస్తున్న శ్రీ ఎ. సాయిబాబా పూజా కార్యక్రమం నిర్వహించారు. టెలిఫిలిం కథను కొప్పిశెట్టి సమకూర్చగా దర్శకత్వం బడి ఫేం తాతాజీ నిర్వహిస్తున్నారు. యువ కళాకారులు రామస్వామి, బాల్జీ, రమణయ్య, సువర్ణ కుమారి, విజయ లక్ష్మి, మణి కుమారి తదితరులు నటిస్తున్నారు.

### శ్రీనాథ జయంతి సభ

మహాకవి శ్రీనాథుని జయంతి సభను వర్ధమాన సమాజం 2 తేది సాయంత్రం టౌన్‌హాల్‌లో జరుప నున్నది. ఉస్మానియా విశ్వ విద్యాలయం ప్రొఫెసర్ ముదిగొండ శివప్రసాద్ 'తెలుగులో శైశవ కవిత'-అంశంపై ఉపన్యసించి శ్రీమతి పోలం రెడ్డి యశోధర స్మృత్యంకంగా శ్రీ డి. నరేంద్రరెడ్డి ఇచ్చే సన్మానాన్ని స్వీకరిస్తారు. సభా ప్రారంభానికి ముందు ఔత్సాహిక గాయకులు ప్రేమకుమారి, భారతి, రాధ, ప్రభు, రమేష్ బాబుల భక్తి సంగీతాలాపన వుంటుందని వర్ధమాన సమాజం కార్యదర్శి టి.వి. నరసింహులు తెలుపుతున్నారు.

### సినిమా

(7 పేజీ తరువాయి)

పోతుంది. అందేత అతని ఆత్మను హీరోయిన్ శరీరంలోకి ప్రవేశ పెడతారు. ఇలాంటి పరకాయ ప్రవేశాలు, తప్పుల తమాషాలు ఎన్నో ఉన్న ఈ చిత్రంలో కింకరులు కూడా మోడరన్ గా ఉంటారు. సత్యనారాయణ యమ ధర్మరాజు, బ్రహ్మానందం పిరికి కానిస్టేబిల్. అతని శరీరంలోకి ఒక ఉగ్రవాది ఆత్మ ప్రవేశిస్తుంది. నాయిక విజయశాంతి పక్కన కాస్సేపు కనిపించే హీరో పాత్రకు ఏ అగ్ర నటుడ్ని బుక్ చేయాలో ఇంకా తేలలేదు" అన్నారు. రావుగోపాల రావు, కోట శ్రీనివాస రావు, బాబూమోహన్, రామిరెడ్డి, మల్లికార్జున రావు, అలీ ఇతర పాత్రధారులు. ప్రేక్షకుల అభిరుచులు మారినా దర్శక నిర్మాతలు పాత చిత్రాల కోవలోనే కొత్త చిత్రాలు తీయడం సాహసమే మరి.

### డమ్మీ షూటింగ్

ప్రతి చిత్రంలోనూ ఏదో కొత్తదనం కనబరచాలని తాపత్రయపడే బహుకొద్ది మందిలో కమలహాసన ముఖ్యుడు. తాజా చిత్రం "మహానది" కథ గురించి ఎందరో రచయితలతో చర్చించారు. ఆ తర్వాత 'రిహార్సల్స్' లాగా పది రోజుల పాటు డమ్మీ షూటింగ్ జరిపారు. తన పాత్రను తానే నిర్వహిస్తూ, ఇతర పాత్రలను సహాయ సహకార దర్శకులచే డూప్‌గా నటింప జేసి, రషెస్‌ను ప్రివ్యూ థియేటర్‌లో చూశారు. కాస్ట్యూమ్స్, లొకేషన్స్, కెమెరా కోణాలు వగైరాలు చక్కగా అమరాయా లేదా తెలుసు కోడానికి వీలయింది. ఇలా హాలీవుడ్‌లో జరగడం మామూలు. మన దేశంలో దీనికి నాంది పల్కిన ఖ్యాతి కమల్‌కె దక్కుతుంది.

## పంచాంగము

### గురుమౌఢ్యమి

2 తేది శనివారం గాంధీ జయంతి

5 తేది మంగళ వారం గురు మౌఢ్యమి ప్రారంభం

### అక్టోబరు తిథులు

నిజభాద్రపదబహుళ

| | |
|---|---|
| తే 2 శని విదియ | రా.గ. 3.15 వ |
| తే 3 ఆది తదియ | రా.గ. 5.00 వ |
| తే 4 సోమ చతుర్థి పూర్తిగ | |
| తే 5 మంగళ చతుర్థి | ఉ.గ. 6.15 వ |
| తే 6 బుధ పంచమి | ఉ.గ. 7.20 వ |
| తే 7 గురు షష్టి | ఉ.గ. 7.50 వ |
| తే 8 శుక్ర సప్తమి | ఉ.గ. 7.45 వ |

స్వయంపాకుల శ్రీనివాసులు
ఎం.ఏ

### నీటిమట్టం

| | |
|---|---|
| నెల్లూరు చెరువు | 11.4 అ |
| కనిగిరి రిజర్వాయరు | 13.6 అ |

### నెల్లూరు బజారు

| | |
|---|---|
| మొలగొలుకులు | |
| 9672 (కొత్తవి) | 3,500/- |
| 9674 (కొత్తవి) | 3,800/- |
| ఐ.ఆర్. 20 | 3,000/- |
| ఐ.ఆర్. 64 | 2,700/- |
| బియ్యం బస్తా (70 కేజీ) | 540/- |
| బియ్యం కేజీ | 8/- |
| బంగారు సవర (8గ్రా) | 3,280/- |
| వెండి (10 గ్రా) | 61/- |
| రిటైల్ ధరలు | |
| వేరుశెనగ నూనె (కేజీ) | 37/- |
| దాల్డా(కేజీ) | 42/- |
| కొబ్బరి నూనె (కేజీ) | 55/- |
| పెసరపప్పు (కేజీ) | 20/- |
| చింతపండు (కేజీ) | 25/- |
| చక్కెర (కేజీ) | 10.60/- |
| బెల్లం (కేజీ) | 18/- |

## జనవాణి

(3 పేజీ తరువాయి)

కాకుంటా తిరిగి వచ్చాము. వైద్యం పేరుతో ప్రజలను ఈ విధంగా దోచుకోవాలని ప్రయత్నించడం సేవా దృక్పథంతో వృత్తి ధర్మం నిర్వర్తించ వలసిన డాక్టర్లకు తగదు.

కలిచేడు – ఎస్. మహబూబ్ బాష

### కాంట్రాక్టర్లను శిక్షించే చట్టం తేవాలి

గత మాసంలో నేను నెల్లూరు వచ్చాను. ఆ సమయంలో వేస్తున్న జాతీయ రహదారి పై నడిచి వెళుతూ అది వేస్తున్న తీరు చూసి ఆశ్చర్య పోయాను. ముక్కలు ముక్కలుగా తారు పోసి దాని పై మట్టితో నిండిన కంకర పరుస్తున్నారు. ఆ దృశ్యం చూచి ఆ రాళ్లతోనే కాంట్రాక్టరును కొట్టాలన్నంత కోపం వచ్చింది. జాతీయ రహదారులను అంత అధ్వాన్నంగా వేస్తున్న మహాను భావులైన కాంట్రాక్టర్లను ఏం చేయాలో అర్థం కాలేదు. ఇటువంటి అక్రమాలు జరుగుతున్నప్పుడు ప్రజలు ఫిర్యాదు చేయను వినియోగదార్ల కోర్టులను పోలిన సంస్థను ఏర్పాటు చేయను శక్తి చట్టం తేవాలి. అంత వరకు పత్రికలు, ప్రజలు చేసే విమర్శలు కాకి అరుస్తున్నా కరవాదు చేపఎండిన చందాన వృధా అవుతూనే వుంటాయి.

కొచ్చిన్ – ఎన్. రామచంద్రా రెడ్డి

### జీపు ఆచూకీ తెలుపండి

1989 లో జరిగిన పార్లమెంటు, అసెంబ్లీ ఎన్నికల సందర్భంగా ప్రచారం నిమిత్తం జిల్లా కాంగ్రెస్ కమిటీలకు జీపులనిచ్చారు- అప్పటి పార్టీ నేత శ్రీ రాజీవ్ గాంధీ. ఇటీవల వరకు ఆ జీపు డి.సి.సి. అధ్యక్షుడి ఇంటి వద్దనే, కాంగ్రెస్ కార్యాలయం లోనో దర్శనమిస్తుండేది. కాని గత కొన్ని రోజులుగా అది కన్పడడంలేదు. పైగా, మలిదేవి కాంట్రాక్టు పనుల దగ్గర దర్శన మిస్తున్నదని వార్త. ఆ జీపు ఆచూకీ తెల్పిన వారికి తగు బహుమానం ఇస్తాము.

– కాంగ్రెస్ కార్యకర్తలు

### కమ్యూనిస్టులకు మంచి అవకాశం

అంత వరకు భారతదేశంలోని, కమ్యూనిస్టులు దేశ పౌరసత్వం, తద్వార లభించే సకల సౌకర్యాలు పొందుతున్నా నిత్యం రష్యా, చైనా దేశాలను కీర్తిస్తూ కాలం గడిపేవారు. రష్యా పతనమై మళ్లీ ఏర్పడిన ప్రభుత్వాలు అంతర్యుద్ధాలలో కూరుకపోతే, చైనాలో అప్పుడప్పుడే ప్రజల వాణి పురి విప్పుతున్నది. శ్రామిక పీడిత వర్గాలకు స్వర్గధామాలు అని ప్రచారం జరుగుతుండిన ఆ దేశాలలోని వాస్తవ పరిస్థితులు బయటపడ్డాయి. ఇకనైనా భారతదేశం, అందులోని సమస్యల పై దృష్టి సారించి దేశాభివృద్ధి కై పోరాటం చేసేందుకు ఒక మంచి అవకాశం వచ్చింది. దాన్ని జారవిడువ కోరనుకుంటాను.

-గునుపాటి వేణుగోపాల్

నెల్లూరు

### విడాకులు కోరకుండా సెక్స్ కౌన్సిలింగ్

మన దేశంలో కూడా యిటీవల విడాకులు తీసుకొంటున్న వారి శాతం విపరీతంగా పెరుగుతూ వుంది. విడాకులకు దారి తీసే సాంఘిక, ఆర్థిక పరిస్థితులకు వ్యక్తిగత మనస్తత్వాల లోని వైరుధ్యాలు దోహదం చేస్తాయి. సాంఘిక, ఆర్థిక పరిస్థితుల లోని లోపాలను అంత త్వరగా సరిదిద్దలేము. విడాకులు అరి కట్టడానికి ప్రస్తుతానికి మనం చేయగలిగింది, వ్యక్తుల మనస్తత్వాలలో అవసరమైన మార్పులు తీసుక రావడమే. భార్య అభిరుచుల మూలంగా భర్తకు కొన్ని కష్ట నష్టాలు సంభవించ వచ్చు. అలాగే భర్త అభిరుచుల మూలంగా భార్యకు కూడా; జీవితాంతం కలిసి మనుగడ సాగించ వలసిన వాళ్లు ఇట్టి యిద్దరికి కొంత సహనం అవసరం. ఎడబాటును తట్టు కోలేనంత గట్టి బంధం దంపతుల మధ్య యేర్పడినప్పుడే సహనం అలవడుతుంది. అంతటి గట్టి బంధం యేర్పరచడానికి సెక్స్ కౌన్సిలింగ్ అవసరం.

–డాక్టర్ ఇ. రాజగోపాల రెడ్డి

నెల్లూరు

### నియామకాల్లో అక్రమాలు

కడప సెంట్రల్ జైలు పరిధిలో గల జైలు వార్డన్ల నియామకాల్లో ఇటీవల అనేక అక్రమాలు జరిగాయి. తీవ్ర జాప్యం చేసి 9 నెలల తరువాత విడుదల చేసిన జాబితాలో అంతా లోటు పాట్లే. రాత, శారీరక, మౌఖిక పరీక్షలలో ప్రతిభ చూపిన వారిని పక్కన బెట్టి జైళ్ల శాఖ వున్నతాధి కారులు తమ ఇష్టం వచ్చిన వారిని ఎంపిక చేశారు. కొండను త్రవ్వి ఎలుకను పట్టినట్లుగా ఇంటర్వ్యూల పేరుతో ఆరు జిల్లాల నుండి 600 మందిని పిలిచి కేవలం 16 మందినే ఎంపిక చేశారు. ముందుగా ఖాళీలు ఎన్ని వున్నాయో ప్రకటించక ఇంటర్వ్యూలు జరిపిన భోగాతం పై ప్రభుత్వం విచారణ జరిపి నష్టపోయిన వారికి న్యాయం చేకూర్చాలి.

నెల్లూరు –ఎం. ప్రవీణ్

### చిత్రసమీక్ష

(7 పేజీ తరువాయి)

బాగా ఎదిగి పోతాను''- అని జవాబిస్తాడు. విలన్లతో ఫైట్లు చేయటంలో హీరోయిన్లతో చిందులు వేయటంలోనూ ఆరి తేరిన హీరో సుమన్ గూడా తన మాటల్లో హాస్యం సృష్టించాడు.

ఒక ఘరానా దొంగ మరో వర్ధమాన దొంగను ప్రశంసిస్తూ వుండగా, ప్రశంస పొందుతున్న దొంగ ఆ సమయంలోనే, ఘరానా దొంగ రిస్టు వాచి దొంగలిస్తాడు. ఈ సన్నివేశం సహజంగా కనిపించక పోయినా హాస్యం చిగురింప జేసింది. ఒక అమ్మాయి ఉంగరం దొంగలించిన దొంగ ఆ అమ్మాయి తండ్రికే ఆ ఉంగరం అమ్మబోవటం అసహజమే! కాని ఆ సన్నివేశంలో హాస్యరసం ఉద్భవించింది.

ఇప్పుడు చెప్పిన హాస్య సన్నివేశాలన్నీ, శరత్ దర్శకత్వంలో తయారైన ''దొంగల్లుడు'' చిత్రంలోనివి. ఇవేగాక యిలాంటి హాస్య సన్నివేశాలు చిత్రం మొదటి భాగం నిండుగా వున్నాయి. హాస్యం కోసం కథకు సంబంధం లేని పంథాను అనుసరించక, దర్శకుడు ముఖ్య కథాంశాన్ని, ముఖ్య పాత్రలను హాస్యానికి చక్కగా ఉపయోగించు కున్నారు. తనదైన ప్రత్యేక శైలితో చిత్రాన్ని వినోదాత్మకంగా రూపొందిం చారు. ప్రేక్షకులను కడుపుబ్బా నవ్వించారు. ఈ చిత్రం ఒక మంచి వినోద కాలక్షేపం కావడానికి కొమ్మనాపల్లి గణపతి రావు వ్రాసిన కథ, సత్యానంద్ వ్రాసిన మాటలు గూడా చాలా వరకు ఉపకరించాయి. ఎక్కడా అపహాస్యం, అసభ్యత కనిపించవు.

అల్లరి చిల్లరి దొంగగా తిరుగుతూ విజయ్ (సుమన్) లత (సౌందర్య) అనే కలవారి పిల్లను వలలో వేసుకొని పెళ్లి చేసుకుంటాడు. పెళ్లయిన తర్వాత తెలుస్తుంది లతకు తన భర్త ఒక దొంగ అని. మామ (రావు గోపాల రావు) కూ అంతే. కొన్ని సంఘటనలు ఒక్క కుదుపు కుదిపి విజయ్‌కు కనువిప్పు కలిగిస్తాయి. అవినీతిని పంచు కోవటం మాని మంచిని పెంచు కుంటాడు. దుర్మార్గులైన సత్తి (సత్యనారాయణ), శంకు ( కాస్ట్యూమ్స్ కృష్ణ) లను హత మారుస్తాడు.

నటీనటులంతా తమ ఇమేజ్‌లు మరచి హాస్యం వైపు బాగా వెలుగు చూపారు. నెగ్గుకొచ్చారు. వేటూరి, భువనచంద్ర వ్రాసిన పాటల దృశ్యాలను మహీధర్ కెమరా బహు సుందరంగా చిత్రించింది.

### డయాబటిస్

(4 పేజీ తరువాయి)

నిత్యం వాడే షుగర్ మాత్రలు మరియు ఈ మందు వల్ల రక్తంలో చక్కెర మామూలు స్థాయి కంటె (70 Mg %) తగ్గిపోయి మెదడు పని చేసేదానికి అవసరమయ్యే ఇంధనం అందక ప్రాణాపాయం సంభవించవచ్చు. ఈ పరిణామం వల్లనే చాలా మంది వైద్య సహాయం అందేలోపల నిద్ర మత్తులోనే మరణిస్తుంటారు. రక్తపోటు వున్నవారు (Hypertension) మద్యం సేవించితే వారి బి.పి. ( రక్తపోటు) ఎక్కువవుతుంది. తరచుగా మద్యం సేవిస్తున్న వారిలో రక్తపోటును అదుపులో వుంచడం కష్టం.

వైద్య శాస్త్రజ్ఞులు ఈ మధ్య జరిపిన పరిశోధనలలో మద్యాన్ని సేవించే వారిలో గుండెకు హాని చేసే చెడ్డ క్రొవ్వు పదార్థాలు (Triglycericles) హెచ్చు స్థాయిలో వుండడాన్ని గమనించారు. దీని కారణంగా మధు మేహం వున్న వారిలో గుండెపోటు వచ్చే అవకాశం ఎక్కువగా వుంటుంది. అంతే కాకుండా షుగరు వ్యాధి వున్నవారు దీర్ఘకాలం ఈ మద్యానికి అలవాటు పడితే అరికాళ్ల మంటలు, తిమ్మిర్లు, కాళ్లు మొద్దు బారటం, వేళ్ల చివర సూదులతో గుచ్చినట్లు బాధ కలగడం, అరికాళ్లకు స్పర్శ తగ్గి పోవటం మనం చూస్తుంటాం. పై సమస్యల వల్ల చాలా మంది నిద్ర లేమికి గురి అవుతూ డిప్రెషన్‌కు లోనవు తుంటారు.

#### మద్యపానం వారసత్వమా?

షుగరు వ్యాధి వారసత్వంగా వస్తుందని అందరికీ తెలిసిన విషయమే. తల్లిదండ్రులలో ఇద్దరికి చక్కెర వ్యాధి వున్నట్లయితే వారి పిల్లలలో డయాబిటిస్ వచ్చే అవకాశం 70 నుంచి 80 శాతం వరకు వుంది. కాని నేటి నవీన వైద్య విజ్ఞాన శాస్త్రం మద్యపానం కూడా వారసత్వమేనని రుజువు చేస్తున్నది. మద్యపాన ప్రియులు ఈ విషయాన్ని ఒప్పుకోక పోయినా ఇది చేదు వాస్తవమే.

మధుమేహం వున్నవారు దీర్ఘకాలం ఆల్కహాల్‌ను సేవించి నట్లయితే వారి జననేంద్రియాల సామర్థ్యం తగ్గి క్రమేణా నపుంసకత్వానికి కూడా దారితీయవచ్చు.



### ప్రకటన

నెల్లూరు టౌన్ వేదాయపాళెం సర్వే నెం. 63/1B లోని 20 అంకణముల ఇంటి ప్లాటు షేక్ మస్తాన్ సాహెబ్, S/o. హుసేన్ సాహెబ్ వద్ద నుండి నేను కొనుగోలు చేయదలచి అడ్వాన్సు కూడా చెల్లించి వున్నాను. సదరు మస్తాన్ సాహెబ్ గారు ఒరిజనల్ పత్రములు పోయినవని చెప్పినారు. ఇందు విషయమై ఎవ్వరికైనా ఎలాంటి ఆక్షేపణలున్నా 10.10.1993 తేదిలోగా తెలుపుకో వలెను. ఆ తర్వాత ఎలాంటి అభ్యంతరములు వచ్చిన నా జవాబు దారి కాదు.

హద్దులు

తూర్పు: పూసల రాజగోపాల రావు గారి ఇల్లు; దక్షిణం: డి. సంజీవయ్య వ్రాయించి యిచ్చిన స్థలం; పడమర: సెపు తులశమ్మ స్థలం; ఉత్తరం: రోడ్డు – ఈ హద్దుల మధ్య 20 అంకణముల ఖాళీ స్థలం.

రామూరి బ్రహ్మయ్య

13/384, పఠతులవారి వీధి, నెల్లూరు

# జనార్ధన రెడ్డి సైతం యుద్ధం ప్రకటించారా?

## "ఖమ్మంలో వేలు పెడితే కుట్టనా"

- జలగం వెంగళ రావు చిర్రుబుర్రులు

## "హరిజనులకు జరిగిన అన్యాయం సహించను"

- వెంకట స్వామి చిందులు

## "22 పేర్లిస్తే ముగ్గురికిచ్చి సరిపెడ్తాడా?"

- వైఎస్ రాజశేఖర రెడ్డి వీరావేశం

## "బిసిలకు సగం రాజ్యం ఇచ్చి తీరాల్సిందే"

- జగన్నాథ రావు అల్టిమేటం

చేసి వెనుక బడిన, దళిత వర్గాలను నామ మాత్రంగా వుంచుతున్నారని కాంగ్రెస్ పార్టీలోని బి.సి. నాయకులు ఎలుగెత్తి చాటుతున్నారు. ముఖ్యమంత్రి తన మంత్రి వర్గంలో రెడ్డి కులస్థులకు ఎక్కువ మందికి పదవులివ్వటంతో పాటు ముఖ్యమైన పోర్టుఫోలియోలను కూడా వారికే కేటాయించారన్నది బిసిల ప్రధాన ఆరోపణ. రాష్ట్ర జనాభాలో సగానికి పైగా వున్న ఎస్.సి. ఎస్.టి. బి.సి. మైనార్టీలకు అగ్ర కులాలతో సరి సమానంగానైనా రాజకీయాధికారం లభించి తీరాలని వీరు పట్టు పడుతున్నారు. దీని కోసం వీరంతా మాజీ ఉప ముఖ్యమంత్రి సి. జగన్నాథ రావు నివాసంలో సమావేశమై భవిష్యత్ కార్యాచరణను రూపొందించారు. మొదటి దశలో తమ అసంతృప్తిని వినతి పత్రాల ద్వారా ప్రధానికి, ముఖ్యమంత్రికి, కాంగ్రెస్ అధిష్టానంకు పంపి, ఫలితం లేకపోతే రెండో దశగా ఉద్యమించాలని, ప్రజల్లోకి వెళ్లి ముఖ్యమంత్రి పక్షపాత వైఖరిని బట్ట బయలు చేయాలని బిసిల సమావేశం నిర్ణయించింది. సి. జగన్నాథ రావు ప్రధాన మంత్రికి అత్యంత సన్నిహితుడు కావటంతో బిసిల సమావేశానికి ప్రాధాన్యత ఏర్పడింది. ఇలా వుండగా ప్రధాని బంధువు సింగాపురం రాజేశ్వర రావు కూడా ముఖ్యమంత్రి పని తీరు పట్ల పెదవి విరుస్తున్నారట. నేదురుమల్లి జనార్ధన రెడ్డిని పదవిచ్యుతుడ్ని చేయుటంలో రాజేశ్వర రావు కీలక పాత్ర వహించిన సంగతి తెలిసిందే.

పదవుల్లేని మాజీల బాధ ఇలా వుంటే ప్రస్తుతం మంత్రి వర్గంలో వున్న వారు తమకు ప్రాధాన్యం లేని శాఖలు కేటాయించా రంటూ అసంతృప్తి వ్యక్తం చేస్తున్నారు. ముఖ్యమంత్రికి సన్నిహితుడైన రోశయ్య తన అసంతృప్తిని బాహాటంగానే వెళ్ల గక్కుతున్నప్పటికీ ముఖ్యమంత్రి తృప్తి కోసం పత్రికల కెక్కటం లేదు. మరో అరడజను మంది మంత్రులు రోశయ్య బాటలోనే పయనిస్తున్నారు. వీరంతా సరైన సమయం కోసం వేచి చూస్తున్నారు.

### నేదురుమల్లి – కోట్ల ఢీ

ముఖ్యమంత్రి విజయ భాస్కర రెడ్డిని గట్టిగా సమర్థించిన మాజీ ముఖ్యమంత్రి శ్రీ ఎన్. జనార్ధన రెడ్డి కూడా ఉదాసీనంగా వుండటానికి రాజకీయ పరిశీలకులు ప్రాధాన్యం ఇస్తున్నారు. పదవి నుంచి దిగే ముందు తనను సమర్థిస్తున్న 123 మంది ఎమ్మెల్యేలను విజయ భాస్కర రెడ్డికి మద్ధతుగా నిలిపి ముఖ్యమంత్రి పదవిని కట్ట బెట్టడంలో కీలక పాత్ర వహించిన జనార్ధన రెడ్డిని కోట్లవారు పూర్తిగా విస్మరించడమే గాక సొంత జిల్లాలో కూడా పోటీ వర్గాన్ని ఏర్పాటు చేసి చావు దెబ్బ తీశాడని నేదురుమల్లి వర్గీయులు అంటున్నారు. తిరుపతిలో జరిగిన ప్లీనరీ సమావేశాల్లో కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సభ్యుడిగా కోట్ల విమర్శిస్తూ వున్న వై.ఎస్. రాజశేఖర రెడ్డిని చేరదీయటం కూడా నేదురుమల్లి వర్గీయులకు నచ్చటం లేదు. అసమ్మతి పగ్గాలను నేదురుమల్లికి అప్పగించాలని అసంతృప్తియులు ప్రయత్నిస్తుండగా నేదురుమల్లి మాత్రం ఉత్సాహం చూపటం లేదు. కానీ అసమ్మతి వెనుక నేదురుమల్లి హస్తం వుందని ముఖ్యమంత్రి నమ్ముతున్నారు. ముఖ్యంగా పంతం పద్మనాభం రాజీనామాకు, గుర్నాధ రావు రచ్చకు జనార్ధన రెడ్డే ప్రధాన కారకుడని విజయ భాస్కర రెడ్డి పలువురి వద్ద ఆక్రోశం వెళ్ల గక్కారట. కోట్ల వారికి జనార్ధన రెడ్డికి మధ్య ఇప్పుడు అగాధం ఏర్పడింది. నెల్లూరీయులు కొందరు ఈ అగాధాన్ని మరింత పెద్దది చేసి కోట్ల వారి ప్రాపు సంపాదించే కార్యక్రమంలో తలమునకలై వున్నారు. కోట్ల కూడా నేదురుమల్లి పై చెవులు కొరికే వారిని చేరదీస్తున్నారు. దీంతో జనప్రియకు ముఖ్యమంత్రి నివాసానికి మధ్య దూరం మరింత పెరిగింది. అయితే నేదురుమల్లి ఇంత వరకు బహిరంగంగా బయట పడలేదు. ముఖ్యమంత్రి మాత్రం నేదురుమల్లి పై అసంతృప్తిని బాహాటంగా వెల్లడిస్తున్నట్లు భోగట్టా. జనార్ధన రెడ్డికి సొంత జిల్లాలో కూడా బలం లేదని, అటువంటప్పుడు ఆయనను లెక్క చేయాల్సిన అవసరమే ముందని ముఖ్యమంత్రి ఇటీవలనే నెల్లూరు జిల్లా వారిని ఎంపిక చేయించటంలో అప్పుడు ముఖ్యమంత్రిగా వున్న నేదురుమల్లి తన పలుకుబడిని ఉపయోగించారని, అంతే గాకుండా కోట్ల సొంత జిల్లా కర్నూలు

**కోట్ల**
(మొదటి పేజీ కొరవ)

వ్యవహారాల్లో వేలు పెట్టకుండా జిల్లా అధికార మంతా కోట్లకే అప్పగించారని వారు గుర్తు చేస్తున్నారు. కోట్లకు పెద్దరిక మిచ్చి పూర్తిగా సమర్థించిన నేదురుమల్లిని కాదని, నిన్నటి దాకా వున్నారట. వై.ఎస్. రాష్ట్ర వ్యాప్తంగా 22 మంది పేర్లను ముఖ్యమంత్రికి ఇచ్చారట. అందులో కేవలం ముగ్గురికి మాత్రమే ముఖ్యమంత్రి పదవులిచ్చారు. దీని వల్ల వై.ఎస్. పై ఆయన వర్గీయులు బహిరంగంగా అసంతృప్తి వెళ్ల గక్కుతున్నారు. దీంతో ముఖ్యమంత్రిని పూర్తిగా సమర్థించేందుకు వై.ఎస్. వెనకాడటమే గాకుండా సమయం కోసం ఎదురు చూస్తున్నానని తన మద్దతు దార్లను బుజ్జగించు కుంటున్నారట. నివురు గప్పిన అసమ్మతి నిప్పు ప్రమాదాన్ని పసి గట్టిన కోట్ల ప్రజల మద్దతు కోసం రాష్ట్ర వ్యాప్త ప్రర్యటనలు పెట్టుకున్నారు. ప్రజల అండదండలు తన వెంట వుంటె పార్టీ అసమ్మతిని లెక్క చేయాల్సిన పని లేదని ఆయన భావిస్తున్నారు.

### ముఖ్యమంత్రి పై సీనియర్ల కన్నెర

రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ కోట్ల విజయ భాస్కర రెడ్డి వ్యవహరిస్తున్న తీరు పై కాంగ్రెస్ సీనియర్ నాయకులు కన్నెర్ర చేస్తున్నారు. సొంత జిల్లాలో ముఖ్యమంత్రి తమను సంప్రదించక పోగా ప్రత్యర్థి వర్గాలకు పదవులిచ్చి తమ పై ఎగదోస్తున్నాడని వీరు విమర్శిస్తున్నారు.

రాజకీయాలను విరమించుకొని విశ్రాంతి తీసుకుంటున్న మాజీ ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళ రావు మెట్ట ప్రాంతాలకు చెందిన ఒక ఎమ్మెల్యే వద్ద వ్యాఖ్యానించారట. ఇది కాస్తా జనార్ధన రెడ్డికి చేరి పోవటంతో ఆయన తీవ్ర మనస్తాపంగా వున్నారట.

ఇలా వుండగా ముఖ్యమంత్రితో తాత్కాలిక రాజీ కుదుర్చుకున్న వైఎస్ రాజశేఖర రెడ్డి కూడా అసంతృప్తిగా వున్నారు. తన వారికి తగినంత మందికి మంత్రి పదవులు లభించ లేదన్నది వై.ఎస్. అసంతృప్తికి ప్రధాన కారణం. ఇలా వుండగా వై.ఎస్. వర్గీయులకు ముగ్గురికి మంత్రి పదవులివ్వడం ద్వారా ముఖ్యమంత్రి ప్రయోగించిన రాజకీయ నీతి పట్ల వై.ఎస్. అసంతృప్తిగా ముఖ్యమంత్రి పై కస్సు బుస్సు మంటున్నారు. ముఖ్యమంత్రి పని గట్టుకొని తన జిల్లా ఖమ్మంలో ప్రత్యర్థులను రెచ్చ గొట్టి తమ ఉనికిని దెబ్బ తీస్తున్నాడని ఆయన ఆగ్రహంగా వున్నారు. క్రియాశీల రాజకీయాలకు ఎంత దూరంగా వున్నా "నా పుట్టలో వేలెడితే కుట్టనా" అని ఆయన అంటున్నాడట.

ఖమ్మం జిల్లాలో వెంగళ రావు చిరకాల ప్రత్యర్థి శ్రీ చంద్రశేఖర్‌కు మంత్రి పదవి లభించింది. వెంగళ రావును తీవ్రంగా వ్యతిరేకించే శీలం సిద్దా రెడ్డిని ముఖ్యమంత్రి తన అంతరంగికుల్లో ఒకరిగా నియమించు కున్నారు. తెలుగుదేశం పార్టీకి గుడ్ బై చెప్పి ఇటీవలే కాంగ్రెస్‌లో చేరిన చేకూరి కాశయ్య మొదటి నుంచీ వెంగళ రావు వ్యతిరేకిగా వుంటున్నారు. అటువంటి కాశయ్య ప్రస్తుతం ముఖ్యమంత్రి మద్దతు దారుడై వెంగళ రావు పై కాలు దువ్వుతున్నారు. కేంద్ర మంత్రి రంగయ్య, నాయుడు యువజన కాంగ్రెస్ నాయకుడు పి. సుధాకర రెడ్డి కూడా వెంగళ రావు వ్యతిరేకులు కావటం వల్ల కోట్ల ఆస్థానంలో స్థానం సంపాదించు కున్నారని అంటున్నారు. జిల్లాలో తమ వర్గీయులను తరిమి తరిమి వెంటాడుతున్నా రన్నది వెంగళ రావు మద్దతు దారుల ప్రధాన ఆరోపణ. కాగా వెంగళ రావు వర్గీయుల అసంతృప్తి జలగం ప్రసాద్ ద్వారా అప్పటికే వెల్లడైంది. తగిన సమయంలో వెంగళ రావు కూడా రంగ ప్రవేశం చేస్తారని అంటున్నారు.

ఇలా వుండగా పి.వి.కి సన్నిహితుడు, కేంద్ర మంత్రి శ్రీ వెంకట స్వామి ముఖ్యమంత్రి పై విమర్శనాస్త్రాలు సంధిస్తూ వుండటానికి రాజకీయ పరిశీలకులు ప్రాధాన్యం ఇస్తున్నారు. రాష్ట్రంలో బలహీన వర్గాలకు సముచిత స్థానం కల్పించక పోతే పార్టీ దెబ్బ తినే ప్రమాదం ఉందని ఆయన చెబుతున్నారు. ప్రస్తుత రాష్ట్ర మంత్రి వర్గంలో వెనుకబడిన వర్గాలకు మంత్రి పదవుల కేటాయింపు సంతృప్తికరంగా వున్నప్పటికీ వారికి కేటాయించిన శాఖల్లో మాత్రం తీవ్రంగా అన్యాయం జరిగిందని వెంకట స్వామి విమర్శిస్తున్నారు.





Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. OFFSET Printing at Nayagara Paper Products (India) Ltd.,